# కార్గిల్ విజయం



రచన
**సూర్యపుత్ర**

నవయుగభారతి ప్రచురణ
హైదరాబాద్

**కార్గిల్ విజయం**

ప్రథమ ముద్రణ
ప్రమాథి నామ సం.ర
తొలి ఏకాదశి
24.7.1999

ప్రచురణ
**నవయుగభారతి**
**3-4-852, బరకత్‌పురా**
**హైదరాబాద్ - 500 027**

అక్షరముల కూర్పు
**మహతి క్రియేషన్స్**
హైదరాబాద్. ✆ 766 3193

ముద్రణ
**ఆకృతి ఆఫ్‌సెట్ ప్రింటర్**
హైదరాబాద్. ✆ 766 4525

ప్రతులకు
**సాహిత్యనికేతన్**
**3-4-852, బరకత్‌పురా**
**హైదరాబాద్ - 500 027**
**ఫోన్ : 756 3236**

**సాహిత్యనికేతన్**
**ఏలూరురోడ్**
**విజయవాడ - 520 002**

వెల : రూ.10.00

# మనవి

దేశవిభజన మనం ఎవరం కోరు కోలేదు. కానీ అది జరిగింది. పాకిస్తాన్ ఏర్పడినప్పటినుండి, కాశ్మీర్‌ను కబళిం చాలనే ప్రయత్నం చేస్తూనే ఉంది. ఉగ్ర వాదులకు శిక్షణ ఇచ్చి, సరిహద్దులు దాటించి కాశ్మీర్‌లో కల్లోలం సృష్టించి, తద్వారా కాశ్మీర్ సమస్యను అంతర్జా తీయం చేయాలనే నిరంతర ప్రయత్నం పాకిస్తాన్ సాగిస్తూనే ఉంది. అలాంటి మరొక ప్రయత్నమే కార్గిల్.

పాకిస్తాన్ పన్నాగం, కార్గిల్ ప్రాముఖ్యం జాతి యావత్తూ ఒకే తాటిన నిలచిన వైనం, కొన్ని పత్రికలు, ప్రతిపక్షాలు నిర్వహిం చిన అనుచిత పాత్ర, అంతర్జాతీయ పరిణా మాలు, భవిష్యత్తులో పాకిస్తాన్‌ను నమ్మ వచ్చా? ద్వితీయ సర్‌సంఘ్‌చాలక్‌గా గురూజీ చేసిన హెచ్చరికలు ఈ పుస్తకంలో పొందుపర్చినాము.

ప్రయాసకోర్చి, విషయాలను సేకరించి పుస్తకాన్ని వ్రాసి ఇచ్చిన శ్రీ సూర్యపుత్రకు ధన్యవాదాలు.

**— ప్రకాశకులు**

# ముందుగా...

వీరభారతజాతి స్వర్ణేతిహాసంలో కార్గిల్ మరో జాజ్వల్యమానమైన అధ్యాయం! జవాన్లు, ప్రభుత్వం, జాతి యావత్తూ కలిసి సాధించిన కార్గిల్ విజయం దక్షిణాసియాలోనేకాక, రాబోయే రోజులలో అంతర్జాతీయ రాజకీయాల్లోనూ ఒక కీలకమైన మైలు రాయిగా నిలుస్తుంది.

ఈ పోరాటపు స్వరూప స్వభావాలు, సైనికుల అసమాన త్యాగాలు, జాతి స్పందించిన తీరు, పోరాటపు ప్రభావ పరిణామాలను ఈ పుస్తకంలో వర్ణించేందుకు ప్రయత్నం జరిగింది. అయితే ఇది సమగ్రమైన ప్రయత్నమని రచయిత భావించడం లేదు.

రక్షణ, భద్రతాపరమైన అంశాలపై జాతిలో అవగాహన పెంచవలసిన అవసరం ఎంతో ఉంది. అలాగే కార్గిల్ నేపథ్యంలో వెల్లువెత్తిన దేశభక్తికి శాశ్వత ప్రాతిపదికను కల్పించి, జాతిని కార్యోన్ముఖం చేయాల్సిన అవసరం వుంది. ఆ దిశలో ఒక చిన్న ప్రయత్నంగానే దీనిని భావించాలి.

*కనిపించని సైనికునికి*
*కన్నీళ్ళే తర్పణం!*
*తా వెడలిన దారిలోనె*
*తన మనముల అర్పణం!*

భవదీయ
సూర్యపుత్ర

# సాహిత్యనికేతన్
## మీకందించిన ఆణిముత్యాలు

| | | |
|---|---|---|
| 1. | విజయానికి వారసులం మనం | 6.00 |
| 2. | పర్యావరణం - భారతీయ దృక్పథం | 6.00 |
| 3. | భారతీయ విద్యా విధానము | 10.00 |
| 4. | చిన్నారుల చదువులు | 10.00 |
| 5. | డా. అంబేద్కర్ అంతరంగం | 15.00 |
| 6. | మాతృభూమి ముక్కలైంది | 15.00 |
| 7. | డా. బాబాసాహెబ్ అంబేత్కర్ జీవిత చరిత్ర | 20.00 |
| 8. | కర్మయోగి దీనదయాళ్ ఉపాధ్యాయ | 20.00 |
| 9. | విప్లవాగ్ని అల్లూరి | 20.00 |
| 10. | భారతీయ మహిళ | 20.00 |
| 11. | సమైక్యత యజ్ఞంలో సమిధ - డా. శ్యాంప్రసాద్ ముఖర్జీ | 25.00 |
| 12. | సేవాపథము | 30.00 |
| 13. | నేను - మనువు - సంఘము | 40.00 |
| 14. | జాగృతి కథలు | 60.00 |
| 15. | యుగద్రష్ట డాక్టర్ హెడ్గేవార్ | 60.00 |
| 16. | RSS ఆకృతి దాల్చిన ఆదర్శం | 60.00 |
| 17. | శ్రీ గురూజీ | 125.00 |
| 18. | పాంచజన్యం | 150.00 |
| 19. | ప్రేరణ దీపాలు (8 పుస్తకాలు)<br>(మహనీయుల జీవితాలలో అద్భుత సంఘటనలే ప్రేరణ దీపాలు) | 108.00 |
| 20. | భారత భారతి (బాలపుస్తకమాల36 పుస్తకాలు)<br>(చరిత్రకే వన్నె తెచ్చిన మహనీయుల జీవితాలే ఈ పుస్తకాలు) | 204.00 |

భారత్ - పాకిస్తాన్ పడోసీ సాథ్ సాథ్ రహనా హై
ప్యార్ కరే యా వార్ కరే దోనోం కో హీ సహనా హై
జో హమ్ పర్ గుజరీ, బచ్చోంకే సంగ్ న హోనే దేంగే
జంగ్ న హోనే దేంగే -

ఫిబ్రవరి నెలలో లాహోర్ బస్ యాత్ర సందర్భంగా పాకిస్తానీయుల ఏర్పాటు చేసిన స్వాగత సభలో ప్రధానమంత్రి అటల్ బిహారీ వాజ్‌పేయీ చదివిన కవిత అది.

భారత్ - పాకిస్తాన్‌లు ఇరుగూ, పొరుగు అని, కలిసి మెలసి ఉండాలని, కలహంలోనూ చెలిమిలోనూ ఫలితాల్ని సరిసమానంగా పంచుకోక తప్పదని వాజ్‌పేయి ఆ కవితలో పాకిస్తాన్‌కి గుర్తు చేసారు.

అంతేకాదు, తమ తరం వైరాన్ని తరువాతి తరాలకు వారసత్వంగా పంచవద్దని పిలుపునిస్తూ, అటల్‌జీ దృఢంగా చివరిమాట చెప్పారు. ''జంగ్ న హోనే దేంగే'' (యుద్ధాన్ని రానివ్వం)

1948లో పాకిస్తాన్ కాశ్మీర్‌ను కబళింపజూసి కాలుజారి పడింది. 1965 యుద్ధంలో మళ్ళీ జబ్బచరచి గోదాలోకి దిగిన పాకిస్తాన్‌కి పరాభవం ఎదురైంది. 1971లో అడ్డూ అదుపూలేని అహంకారంతో చెలరేగిన పాకిస్తాన్‌ను ఓడించడమే కాక, ఆ దేశాన్ని శాశ్వతంగా రెండు ముక్కలు చేయడం జరిగింది. ముమ్మారు పరాభవానికి, పరాజయానికీ లోనైన పాకిస్తాన్ మాత్రం అటల్‌జీకి ఎర్రతివాచీ పరుస్తూనే తన సైన్యానికి రక్తం కురిపించమని ఆజ్ఞలు జారీ చేసింది. మియా నవాజ్ షరీఫ్ ఆలింగనం చేసుకుంటూనే ఆక్రమణకు ఆదేశాలిచ్చాడు. పెదవులపై ప్రేమను పూసుకుని, చేతుల్లో చురకత్తి దాచుకుంది పాకిస్తాన్.

మనం 'జంగ్ న హోనే దేంగే' అంటున్న సమయంలోనే జెహాద్‌కి తలపడింది పాకిస్తాన్. సియాచిన్, వులర్ లేక, సర్‌క్రోక్ తదితర వివాదాల్ని పరిష్కరించుకునేందుకు సామరస్య పూరితంగా ప్రయత్నాలు జరుగుతూండగానే పాకిస్తాన్ వెన్నుపోటుకి సిద్ధమైంది. దోస్తీ హస్తం చాస్తున్న తరుణంలోనే ద్రోహానికి తలపడింది పాకిస్తాన్.

ఈసారి పాకిస్తాన్ కార్గిల్‌ను లక్ష్యంగా ఎంచుకుంది!

అసలు పాకిస్తాన్ ఈ దాడికి పూనుకోవడానికి కారణాలేమిటి? ఈ ప్రశ్నకు జవాబు పాకిస్తాన్ నైజంలో దొరుకుతుంది. పాకిస్తాన్‌లో ప్రస్తుతం నెలకొన్న అయోమయంలో దొరుకుతుంది. పాకిస్తాన్ దీర్ఘకాలిక లక్ష్యాల అధ్యయనంలో దొరుకుతుంది.

పాకిస్తాన్‌కు ప్రపంచ దేశాల్లో ఒక ప్రత్యేకత ఉంది. ఇస్లామ్ ఆధారంగా ఒక దేశం నుంచి విడివడి ఏర్పాటైన మొట్టమొదటి దేశం పాకిస్తాన్. రెండో ప్రపంచ యుద్ధానంతరం సామ్రాజ్యవాద శక్తులు ఏలుకోలేక వదిలిపెడితే కొన్ని దేశాలు పుట్టాయి. రెండువేల ఏళ్ళ అన్వేషణలో ఇజ్రాయిల్ పుట్టింది. పన్నెండు వందల సంవత్సరాల ద్వేషంనుంచి పాకిస్తాన్ పుట్టింది. క్రీ.శ.712లో మహ్మద్ బిన్ కాశిం దాడి ఫలితంగా అంకురించిన ఈ విచ్ఛిన్నతా బీజాలు 1947లో పాకిస్తాన్ అనే విషవృక్షంగా పరిణమించాయి. పాకిస్తాన్ మనుగడకు ఆధారం భారత్ వ్యతిరేకత! భారతదేశంపై అసూయ, అక్కసు, విద్వేషం, విషవమనం - ఇవే పాకిస్తాన్ ఉచ్ఛ్వాస నిశ్వాసాలు. కాశ్మీర్‌లోకి చొరబడ్డా, వెయ్యేళ్ళ పాటూ జీహాద్ సాగిస్తామన్నా ఈ ద్వేషం ఫలితంగానే జరుగుతోంది.

పాకిస్తాన్‌కి మరో ప్రత్యేకత ఉంది. పాకిస్తాన్ రెండుసార్లు పుట్టింది. ఒక పాకిస్తాన్ 1947లో పుడితే, రెండో పాకిస్తాన్ 1971 బంగ్లాదేశ్ యుద్ధంలో చచ్చి బతికింది. 1971లో 'చచ్చిబతికిన' పాకిస్తాన్ ముస్లిం జనాభా

విషయంలో మూడో స్థానానికి జారిపోయింది. అతి పెద్ద ముస్లిం దేశంగా ఇండోనేషియా, బంగ్లాదేశ్‌లు అవతరించగా, పాకిస్తాన్ మూడో స్థానానికి చేరుకుంది. అంతేకాదు - పాకిస్తాన్ మార్కెట్ సగానికి కుచించుకు పోయింది. పాకిస్తాన్ అధికార యంత్రాంగం సగానికి తగ్గిపోయింది. ఈ అవమాన భారంతో కుతకుతలాడిపోయిన పాకిస్తాన్ ఆధునికత ముసుగుల్ని విడిచి ఇస్లామిక్ తీవ్రవాద పగతో రగిలే దేశంగా రూపెత్తింది. భారత్‌ని దొంగదెబ్బ తీయాలన్న ఏకైక వాంఛ పాకిస్తాన్‌కి ఆలంబన అయిపోయింది. దాని ఫలితమే పంజాబ్‌లో ఖలిస్తానీ తీవ్రవాదం, ఈశాన్య భారతంలో విచ్ఛిన్నవాదం, కాశ్మీర్‌లో కలాష్నికోవ్ సంస్కృతి, బొంబాయి బాంబు పేలుళ్ళు. దేశమంతా విస్తరించిన ముస్లిం తీవ్రవాదం!

పాకిస్తాన్‌కి మరో సమస్యకూడా ఉంది. అక్కడ అన్ని రంగాల్లోనూ సైన్యం ఆధిపత్యం కొనసాగుతుంది. మంత్రులూ, ప్రధానమంత్రులూ వచ్చి పోతున్నా సైన్యం ఆజమాయిషీ మాత్రం యధాతథంగా వుంటుంది. నిజానికి అక్కడి ప్రజాస్వామ్య ప్రభుత్వం సైన్యం వేసుకున్న ముసుగు మాత్రమే. అక్కడ జలవనరులు,విద్యుత్ విభాగం వంటి పౌర సంబంధ అంశాల నియంత్రణ సైతం పాకిస్తాన్ సైన్యం చేతుల్లోనే వుంటుంది. ఇక పరమాణు శక్తి సంగతి చెప్పనే అక్కర్లేదు. సైన్యాన్ని శాసించిన పాలకుడెవరూ అక్కడ మనుగడ సాగించలేదు. ప్రస్తుతం అక్కడ సైన్యం, ప్రభుత్వాల మధ్య కొనసాగుతున్న అమీ - తుమీ ఫలితంగా ఉరిమి ఉరిమి మంగలం మీద పడ్డట్టు కార్గిల్ యుద్ధం జరిగింది.

వీటన్నిటికన్నా పెద్ద సమస్య ఇంకొకటుంది.

గత అనేక సంవత్సరాలుగా పాకిస్తాన్ ప్రోత్సహిస్తున్న తీవ్రవాదం ఇప్పుడు క్రమేపీ అదుపులోకి వస్తోంది. పంజాబ్‌లో తీవ్రవాదం దాదాపు అంతరించి పోయింది. భారతీయ జనతా పార్టీ ప్రభుత్వం అధికారంలోకి వచ్చాక ఐఎస్ఐ

కార్యకలాపాలు చాలావరకు అదుపులోకి వచ్చాయి. దేశంలో పలుచోట్ల ఐఎస్ఐ ఏజంట్లను, వారి స్థావరాలను ప్రభుత్వం పట్టుకోగలిగింది. ఇటు ఈశాన్యంలోకి వివిధ తీవ్రవాద వర్గాలను దారిలోకి తెచ్చే ప్రయత్నాలు చురుకుగా సాగుతున్నాయి. మరోవైపు కాశ్మీర్‌లో మామూలు పరిస్థితి నెలకొంది. అక్కడ జరిగిన ఎన్నికల్లో ప్రజలు భారీ సంఖ్యలో పాల్గొనడం, ప్రభుత్వం అనుసరించిన పకడ్బందీ వ్యూహం ఫలితంగా తీవ్రవాదం దెబ్బతిని పోవడం పాకిస్తాన్‌కి మింగుడుపడలేదు. స్థానికంగా మద్దతు లభించకపోవడంతో పాకిస్తాన్ భారీ ఎత్తున కిరాయి సైనికుల్ని కాశ్మీర్‌లోకి పంపించింది. కానీ కేంద్ర ప్రభుత్వపు చురుకైన ఎదురు దాడుల ధాటికి వాళ్ళు నిలువలేకపోయారు.

దీనికి తోడు కాశ్మీర్ వివాదాన్ని అంతర్జాతీయం చేసేందుకు జరిపిన అన్ని ప్రయత్నాలూ విఫలమవుతూ రావడం కూడా పాకిస్తాన్‌కి మింగుడు పడలేదు. 1966 నుంచి కాశ్మీర్ వివాదం ఐక్యరాజ్యసమితి భద్రతా మండలి ముందుకి చర్చకి కూడా రాలేదు. దీనితో గతంలో ఐ.రా.స. సెక్రటరీ జనరల్‌గా వున్న బుత్రోస్ ఘోరీ భద్రతామండలి ఎజెండా నుంచి కాశ్మీర్ అంశాన్ని తొలగించేందుకు సన్నాహాలు సైతం ప్రారంభించాడు.

ఈ పరిస్థితిలో ఏదో ఒకరకంగా కాశ్మీర్ వివాదాన్ని మళ్ళీ అంతర్జాతీయం చేయాలన్న వుద్దేశ్యంతోనే పాకిస్తాన్ తాజాగా కార్గిల్‌లో చొరబాటుకు పాల్పడింది. కార్గిల్‌పై దాడికి జవాబుగా భారత్ ఛాంబ్ సెక్టార్‌లోనో, షక్కర్‌గఢ్ సెక్టర్‌లోనో సరిహద్దు దాటి దాడులు చేస్తుందని పాకిస్తాన్ ఊహించింది. తద్వారా భారత్‌ను ప్రపంచదేశాల ముందు ఒక దురాక్రమణదారుగా నిలబెట్టాలని పాకిస్తాన్ ప్రయత్నించింది.

ఈ వ్యూహాన్ని అమలు చేసేందుకు పాకిస్తాన్ కార్గిల్ సెక్టర్‌నే ఎందుకు ఎంచుకుంది?

## కార్గిల్ కీలక ప్రాధాన్యం

జమ్మూ కాశ్మీర్‌లోని లేహ్ జిల్లా 12 వేల నుంచి 14 వేల అడుగుల ఎత్తున్న పీఠభూమి. లేహ్‌కి పశ్చిమ దిశన హిమాలయాలమధ్య ఉంది కార్గిల్. హిమాలయాలకి దక్షిణాన పీర్ పంజాబ్ పర్వతాల మధ్యన శ్రీనగర్ లోయవుంది. దానికి దక్షిణాన జమ్మూ ఉంది. దేశ విభజన కాలం వరకూ ఈ క్షేత్రానికి రాకపోకలు సాగించాలంటే పాకిస్తాన్ వైపునుంచే అనువైన మార్గాలుండేవి. దేశ విభజనానంతరం శ్రీనగర్ నుంచి లేహ్‌వరకూ ఒక నేషనల్ హైవేని నిర్మించటం జరిగింది. శ్రీనగర్‌నుంచి జోజిలా పాస్ కుండా, ద్రాస్, కార్గిల్‌ల మీదుగా, సింధులోయగుండా లేహ్‌కు వెళ్ళే ఈ మార్గాన్ని నేషనల్ హైవే అల్ఫా నంబవర్ 1గా పిలుస్తారు. ఈ రహదారి నుంచే ఖార్దుంగ్లా పాస్ గుండా సియాచిన్ గ్లేసియర్ వరకూ వెళ్తుంది.

లేహ్ ప్రాంతాన్ని చేరుకునేందుకు హిమాచల్ ప్రదేశ్‌లోని బియాస్ లోయ, రోహతంగ్, బారాచలా పాస్‌ల మీదుగా మరోదారి కూడా ఉంది. అయితే ఈ దారి చాలాదూరం వుండటంతో సైనికులు, కాశ్మీర్‌పౌరులు శ్రీనగర్ - కార్గిల్ - లేహ్ రోడ్‌ని మాత్రమే ఉపయోగిస్తారు. ఈ రోడ్డు సంవత్సరంలో ఆరునెలలపాటూ మంచు కురవటం వల్ల మూసుకుపోయి వుంటుంది. లేహ్‌లో ఉన్న సైనికులకు చలికాలానికి కావలసిన ఆహార పదార్థాలు, ఆయుధాలు మిగతా సామగ్రి అంతా మే నుంచి సెప్టెంబర్‌ల మధ్యకాలంలోనే సమకూర్చుకోవలసి వుంటుంది.

సైన్యపరంగా, వ్యూహాత్మకంగా సరిహద్దు రేఖకు సమాంతరంగా రహదారులు నిర్మించటం సరైనది కాదు. ఈ దారులకు ఎప్పుడూ శత్రు దాడుల ప్రమాదం వుంటుంది. ఈ దారిని మూసివేయగలిగితే మొత్తం లేహ్ ప్రాంతాన్ని ఏకాకి చేయవచ్చు. శ్రీనగర్-లేహ్ దారి నియంత్రణరేఖకు సమానాంతరంగా వుంది. కార్గిల్ నగరం నుంచి వాస్తవాధీన రేఖ ఎనిమిది

కిలోమీటర్లు మాత్రమే. ద్రాస్‌కు నియంత్రణ రేఖకి మధ్య పదికిలోమీటర్లు, బటాలిక్‌కి నియంత్రణ రేఖకి మధ్య కేవలం అయిదు కిలోమీటర్ల దూరం మాత్రమే ఉంది. కార్గిల్‌లో భారతీయసైన్యాల బ్రిగేడ్ హెడ్ క్వార్టర్ ఉంది.

ద్రాస్ నుంచి సియాచిన్‌కి 70కిలోమీటర్ల దూరం మాత్రమే! సియాచిన్‌లో గత 15 ఏళ్ళుగా యుద్ధవాతావరణం నెలకొని ఉంది. పాకిస్తాన్ ఈ లేహ్ - శ్రీనగర్ దారిని చేజిక్కించుకుంటే సియాచిన్‌కి సరఫరాలు అందించేందుకు ఆకాశమార్గం తప్ప మరో గత్యంతరం వుండదు.

ఈ లక్ష్యాలతోనే పాకిస్తాన్ కార్గిల్‌ని చొరబాటుకోసం అనువైన స్థలంగా ఎంచుకుంది. వాస్తవాధీన రేఖకి అటువైపు ఆక్రమిత కాశ్మీర్‌లో పాకిస్తాన్‌కి రెండు బ్రిగేడ్ హెడ్ క్వార్టర్లు ఉన్నాయి. ఒకటి స్కార్డులో, రెండోది దాన్సుమ్‌లో వున్నాయి. కార్గిల్ - దాన్సుమ్‌ల మధ్య ఎత్తైన కొండలున్నాయి. ఆ కొండలపై భారత సైనికుల చెక్‌పోస్టులు ఉన్నాయి. మంచుకురిసే సమయంలో ఈ చెక్‌పోస్టులలో పహరాకాయటం చాలా కఠినమైనపని. అందుకే భారత - పాకిస్తాన్‌లు రెండూ చేసుకున్న ఒప్పందం ప్రకారం సెప్టెంబర్‌నుంచి మే వరకూ ఈ చెక్‌పోస్టులను వదిలి సైనికులు హెడ్‌క్వార్టర్స్‌కు వచ్చేస్తారు.

భారతీయ సైనికులు స్థావరాలను విడిచి వచ్చిన తరువాత పాకిస్తాన్ సైనికులు ఈ చెక్‌పోస్టులను ఆక్రమించుకుని, బంకర్లు, స్థావరాలు ఏర్పాటు చేసుకున్నారు. మంచు కరిగిన తరువాత ఈ సరిహద్దు స్థావరాలను తిరిగి ఆక్రమించుకునేందుకు వెళ్ళిన భారతీయ సైనికులను వారు దారుణంగా హత్యచేశారు. దీనితో కార్గిల్ చొరబాటు తొలిసారి వెలుగులోకి వచ్చింది.

మే 5న మంచుకరగడం ప్రారంభంకాగానే మన పెట్రోలింగ్ దళం ఒకటి పిప్పర్స్ అల్లీ, బటాలిక్ సాథూ, చెక్‌పోస్టుల తనిఖీకి వెళ్ళింది. ఆ దళానికి 14నుంచి 17వేల అడుగుల ఎత్తున్న కొండలపై పాక్ తీవ్రవాదులు, సైనికులు

కనిపించారు. ఆదళం వచ్చి ఉన్నతాధికారులకు ఈ విషయాన్ని తెలియ చేసింది. స్థితిని అంచనా వేసేందుకు మరో పెద్ద దళాన్ని అధికారులు పంపించారు. అయితే పాక్ ముష్కర మూకలు ఆ దళంపై దాడిచేసి, నలుగురు జవాన్లను పొట్టన బెట్టుకున్నారు. మరోవైపు పాక్ సైనికులు కొండలపైనుంచి నేషనల్ హైవే 1ఎ పై మోర్టార్ దాడులు ప్రారంభించారు. మే 12న మన సైన్యం ఏరియల్ సర్వేజరిపి చొరబాటుదారులను ఎక్కడ వున్నారో గుర్తించింది. వారు ఇగ్లూల లాంటి మంచు గూళ్ళను కట్టుకుని ఉంటున్నారని గుర్తించింది. దీనితో ఈ సారి జరుగుతున్న దాడి గతంలోని దాడులకన్నా భిన్నమైనదని అందరూ గుర్తించారు.

సరిగ్గా అదే సమయంలో పాకిస్థాన్ అటునుంచి గొరెజ్ సెక్టర్, బందీపురా, ఉరి సెక్టర్లలో భారీ ఎత్తున కాల్పులు జరిపింది. దానితో ఇది కేవలం చొరబాటు మాత్రమే కాదని, పాకిస్తాన్ సైనికుల ప్రత్యక్షసాయంతో జరుగుతున్న దురాక్రమణ అని శ్రీనగర్‌లోని 15వ కార్ప్స్ జనరల్ ఆఫీస్ కమాండెంట్ లెఫ్టినెంట్ జనరల్ కృష్ణపాల్ ప్రకటించారు.

కేంద్ర హోం మంత్రి ఎల్.కె. అద్వానీ కూడా దాడులు జరుపుతున్న వారు కిరాయి సైనికుల వేషంలో వున్న పాకిస్తాన్ సైనికులేనని ప్రకటించారు. చిట్టచివరి శత్రువును హతమార్చే వరకూ ఊరుకునేది లేదని కూడా ప్రకటించారు.

పాకిస్తాన్ కార్గిల్‌పై పట్టు సాధించుకునేందుకు అనేక రోజులనుంచీ ప్రయత్నిస్తోంది.

గత ఏడాది డిసెంబర్‌లో హిజ్బుల్ ముజాహిదీన్ వర్గానికి చెందిన అజహర్ షఫీమీర్ అనే తీవ్రవాది భద్రతా దళాలకు పట్టుబడ్డారు. మీర్‌ను ఇంటరాగేట్ చేసినప్పుడు ఆసక్తికరమైన వివరాలు వెలుగులోకి వచ్చాయి.

అనేక ఏళ్ళు హిజ్బుల్‌లో పనిచేసి విసిగిపోయిన మీర్ ఆక్రమిత కాశ్మీర్‌లోని

కిలోమీటర్లు మాత్రమే. ద్రాస్‌కు నియంత్రణ రేఖకి మధ్య పదికిలోమీటర్లు, బటాలిక్‌కి నియంత్రణ రేఖకి మధ్య కేవలం అయిదు కిలోమీటర్ల దూరం మాత్రమే ఉంది. కార్గిల్‌లో భారతీయసైన్యాల బ్రిగేడ్ హెడ్ క్వార్టర్ ఉంది.

ద్రాస్ నుంచి సియాచిన్‌కి 70కిలోమీటర్ల దూరం మాత్రమే! సియాచిన్‌లో గత 15 ఏళ్ళుగా యుద్ధవాతావరణం నెలకొని ఉంది. పాకిస్తాన్ ఈ లేహ్ - శ్రీనగర్ దారిని చేజిక్కించుకుంటే సియాచిన్‌కి సరఫరాలు అందించేందుకు ఆకాశమార్గం తప్ప మరో గత్యంతరం వుండదు.

ఈ లక్ష్యాలతోనే పాకిస్తాన్ కార్గిల్‌ని చొరబాటుకోసం అనువైన స్థలంగా ఎంచుకుంది. వాస్తవాధీన రేఖకి అటువైపు ఆక్రమిత కాశ్మీర్‌లో పాకిస్తాన్‌కి రెండు బ్రిగేడ్ హెడ్ క్వార్టర్లు ఉన్నాయి. ఒకటి స్కార్డులో, రెండోది దాన్సుమ్‌లో వున్నాయి. కార్గిల్ - దాన్యమ్‌ల మధ్య ఎత్తైన కొండలున్నాయి. ఆ కొండలపై భారత సైనికుల చెక్‌పోస్టులు ఉన్నాయి. మంచుకురిసే సమయంలో ఈ చెక్‌పోస్టులలో పహరాకాయటం చాలా కఠినమైనపని. అందుకే భారత - పాకిస్తాన్‌లు రెండూ చేసుకున్న ఒప్పందం ప్రకారం సెప్టెంబర్‌నుంచి మే వరకూ ఈ చెక్‌పోస్టులను వదిలి సైనికులు హెడ్‌క్వార్టర్స్‌కు వచ్చేస్తారు.

భారతీయ సైనికులు స్థావరాలను విడిచి వచ్చిన తరువాత పాకిస్తాన్ సైనికులు ఈ చెక్‌పోస్టులను ఆక్రమించుకుని, బంకర్లు, స్థావరాలు ఏర్పాటు చేసుకున్నారు. మంచు కరిగిన తరువాత ఈ సరిహద్దు స్థావరాలను తిరిగి ఆక్రమించుకునేందుకు వెళ్ళిన భారతీయ సైనికులను వారు దారుణంగా హత్యచేశారు. దీనితో కార్గిల్ చొరబాటు తొలిసారి వెలుగులోకి వచ్చింది.

మే 5న మంచుకరగడం ప్రారంభంకాగానే మన పెట్రోలింగ్ దళం ఒకటి షిప్పర్స్ అర్లీ, బటాలిక్ సాథూ, చెక్‌పోస్టుల తనిఖీకి వెళ్ళింది. ఆ దళానికి 14నుంచి 17వేల అడుగుల ఎత్తున్న కొండలపై పాక్ తీవ్రవాదులు, సైనికులు

కనిపించారు. ఆదళం వచ్చి ఉన్నతాధికారులకు ఈ విషయాన్ని తెలియ చేసింది. స్థితిని అంచనా వేసేందుకు మరో పెద్ద దళాన్ని అధికారులు పంపించారు. అయితే పాక్ ముష్కర మూకలు ఆ దళంపై దాడిచేసి, నలుగురు జవాన్లను పొట్టన బెట్టుకున్నారు. మరోవైపు పాక్ సైనికులు కొండలపైనుంచి నేషనల్ హైవే 1ఎ పై మోర్టార్ దాడులు ప్రారంభించారు. మే 12న మన సైన్యం ఏరియల్ సర్వేజరిపి చొరబాటుదారులను ఎక్కడ వున్నారో గుర్తించింది. వారు ఇగ్లూల లాంటి మంచు గూళ్ళను కట్టుకుని ఉంటున్నారని గుర్తించింది. దీనితో ఈ సారి జరుగుతున్న దాడి గతంలోని దాడులకన్నా భిన్నమైనదని అందరూ గుర్తించారు.

సరిగ్గా అదే సమయంలో పాకిస్థాన్ అటునుంచి గైరెజ్ సెక్టర్, బందీపురా, ఉరి సెక్టర్లలో భారీ ఎత్తున కాల్పులు జరిపింది. దానితో ఇది కేవలం చొరబాటు మాత్రమే కాదని, పాకిస్తాన్ సైనికుల ప్రత్యక్షసాయంతో జరుగుతున్న దురాక్రమణ అని శ్రీనగర్‌లోని 15వ కార్ప్స్ జనరల్ ఆఫీస్ కమాండెంట్ లెఫ్టినెంట్ జనరల్ కృష్ణపాల్ ప్రకటించారు.

కేంద్ర హోం మంత్రి ఎల్.కె. అద్వానీ కూడా దాడులు జరుపుతున్న వారు కిరాయి సైనికుల వేషంలో వున్న పాకిస్తాన్ సైనికులేనని ప్రకటించారు. చిట్టచివరి శత్రువును హతమార్చే వరకూ ఊరుకునేది లేదని కూడా ప్రకటించారు.

పాకిస్తాన్ కార్గిల్‌పై పట్టు సాధించుకునేందుకు అనేక రోజులనుంచీ ప్రయత్నిస్తోంది.

గత ఏడాది డిసెంబర్‌లో హిజ్బుల్ ముజాహిదీన్ వర్గానికి చెందిన అజహల్ షఫీమీర్ అనే తీవ్రవాది భద్రతా దళాలకు పట్టుబడ్డారు. మీర్‌ను ఇంటరాగేట్ చేసినప్పుడు ఆసక్తికరమైన వివరాలు వెలుగులోకి వచ్చాయి.

అనేక ఏళ్ళు హిజ్బుల్‌లో పనిచేసి విసిగిపోయిన మీర్ ఆక్రమిత కాశ్మీర్‌లోని

ముజఫరాబాద్‌లో ఆటో రిక్షా డ్రైవర్‌గా ఉండేవాడు. హటాత్తుగా ఒకరోజు పోలీసులు అతడిని నిర్లక్ష్యంగా బండినడుపుతున్న ఆరోపణపై అరెస్టు చేశారు. ఆ తరువాత జైలులో జీవితాంతం మగ్గుతావా లేక భారత్‌లోకి చొరబడతావా - ఈ రెండింటిలో ఏదో ఒకటి తేల్చుకొమ్మని పోలీసులు అతడిని బెదిరించారు. చివరికి అతను భారత్‌లోకి చొరబడేందుకు నిర్ణయించుకున్నాడు.

పాకిస్తానీలు అతనికి ముస్సెరా - గిల్గిత్ రోడ్ సమీపంలోని ఒక శిక్షణ కేంద్రంలో శిక్షణనిచ్చి పంపించారు. అక్కడ మరో 110 మంది తీవ్రవాదు లుండేవారు. వారిలో 30మంది ఆఫ్ఘన్‌లు, మరో 30మంది పాకిస్తానీలు ఉన్నారు. సెప్టెంబర్ 1998లో ఈ గ్రూపుని అయిదు విభాగాలుగా విడగొట్టి భారత్‌లోకి పంపించారు. వీరికి హెవీ గ్రనేడ్ లాంచర్లు, రాకెట్ సంచాలిత గ్రనేడ్‌లు, స్నిప్పర్ రైఫిల్స్, హెవీ మెషిన్‌గన్‌లు, రాత్రిపూట సరిగా చూసేం దుకు వీలుకల్పించే సాధనాలు ఇచ్చారు. అయితే మీర్ తన గ్రూప్‌తో మళ్ళీ పాకిస్తాన్‌కు తిరిగి వచ్చేశాడు.

ఈసారి అతడిని పాకిస్తానీలు మళ్ళీ తిరిగి వస్తే ప్రాణాలు దక్కవని బెదిరించారు. ఆ తరువాత లోలాబ్ వద్ద మీర్, అతని సహచరుల్ని నియంత్రణ రేఖ దాటించారు. ఆ గ్రూప్‌కి బందీపూర్ - గురెజ్ రహదారిని విధ్వంసం చేయమని, గురెజ్‌లోని సైన్య బలగాల్ని ఒంటరిగాచేసి, చికాకు పెట్టమని, కంగన్ - లేహ్ రోడ్డును ధ్వంసం చేసి, ఆ క్షేత్రానికి సైనిక సాయం అందకుండా చేయాలని బాధ్యతలు అప్పగించారు.

ఈ చర్యలు స్థానికంగా తీవ్రవాదులకు ఏవిధంగానూ ఉపయోగపడవు. నిజానికి వీటివల్ల పాకిస్తానీ సైన్యాలకి వ్యూహాత్మక ప్రయోజనం వుంటుంది. దీని వల్ల భారత సైన్య బలగాలను చికాకులో పెట్టి గురెజ్ సెక్టార్‌లో చొరబడటానికి వీలవుతుంది.

అదే విధంగా ఆగస్టు 9, 1998లో భద్రతాదళాల కాల్పుల్లో చచ్చిపోయిన హిజ్బుల్ ముజాహిదీన్ కమాండర్ అలీ మహ్మద్ దర్ వద్ద కార్గిల్ ద్రాస్ సెక్టర్లకు చెందిన విస్తృతమైన మ్యాపులు లభించాయి. పాకిస్తాన్ కార్గిల్‌పై చాలా కాలం క్రితమే కన్నేసిందనడానికి ఇవే బుజువులు.

ఇవేకాక పాకిస్తాన్ దీర్ఘకాలిక పథకానికి సంబంధించిన అనేక ఇతర వివరాలు కూడా వెలుగులోకి వచ్చాయి. పాక్ ఆక్రమిత కాశ్మీర్‌లోని ఓల్డింగ్ థాంగ్‌లో 350 మందికి యుద్ధ శిక్షణను ఇవ్వడం జరిగింది లేహ్, కార్గిల్ క్షేత్రాల్లో పాకిస్తాన్‌కి చెందిన రిమోట్ కంట్రోల్డ్ పైలట్ విమానాలు తిరుగాడి అవసరమైన వివరాల్ని సేకరించాయి.

ఇవన్నీ పాకిస్తాన్ కార్గిల్ క్షేత్రంలో దాడులకు చాలా కాలం నుంచే రంగం సిద్ధం చేసుకుందన్న సంగతిని బుజువు చేస్తున్నాయి. పాకిస్తాన్ చాలా వ్యూహాత్మకంగా ఆలోచించే కార్గిల్ క్షేత్రాన్ని దాడులకోసం ఎంచుకున్న దన్నది కూడా తేటతెల్లం అవుతోంది.

## తొలినుంచీ కాంగ్రెస్ చేసిన తప్పిదాల ఫలితం

నిజానికి పాకిస్తాన్ మొదటినుంచీ కార్గిల్‌పై కన్ను వేసింది. 1948లో తొలిదశ దురాక్రమణ శ్రీనగర్, బారా ముల్లాలలో జరిగినా, పాకిస్తాన్ అసలు లక్ష్యం కార్గిల్ పైనే ఉందన్నది నిర్వివాదాంశం. నిజానికి బారాముల్లాని గెలుచుకున్నాక మానభంగాలు, అత్యాచారాలు, లూటీలో పాకిస్తాన్ సైనికుల ఒకరోజు పాటూ సమయాన్ని నష్టం చేసి ఉండకపోతే మొత్తం శ్రీనగర్‌లోయ పాకిస్తాన్ చేజిక్కి ఉండేది. ఈ యుద్ధంలో పాకిస్తాన్ మొత్తం జోజిలా పాస్, కార్గిల్‌ను తన గుప్పెట్లో పెట్టుకుంది. అనేక నెలల పాటూ పోరాటం జరిపిన తరువాతే కార్గిల్ మళ్ళీ భారత్ ఆధీనంలోకి వచ్చింది.

1965లోనూ పాకిస్తాన్ కార్గిల్ క్షేత్రంపై పట్టు సాధించేందుకు కొండలపై ఉన్న కీలక స్థావరాలపై ఆధిపత్యం సాధించింది. 1965 యుద్ధానంతరం తాష్కెంట్ ఒప్పందంలో ఈ స్థావరాలను పాకిస్తాన్‌కే భారత్ అప్పగించింది. అప్పటి నుంచి 1971 వరకూ పాకిస్తాన్ సైన్యాలు కార్గిల్ ప్రాంతంలో పదేపదే దాడులు జరిపి, భారత్‌ని చీకాకు పరుస్తూ వచ్చాయి. 1971 యుద్ధంలో మళ్ళీ ఈ స్థావరాలను భారత్ గెలుచుకుంది. ఈసారి మాత్రం ఆ స్థావరాలను మళ్ళీ పాకిస్తాన్‌కు ఇవ్వలేదు. సిమ్లా ఒప్పందంలో భాగంగా భారత్ తరపున లెఫ్టినెంట్ జనరల్ పి.ఎస్. భగత్, పాకిస్తాన్ తరపున లెఫ్టినెంట్ జనరల్ అబ్దుల్ హమీద్ ఖాన్‌లు కలిసి కాశ్మీర్‌లో నియంత్రణ రేఖను నిర్ధారించటం జరిగింది.

అయితే సిమ్లా ఒప్పందం సిరా తడి ఆరక ముందే పాకిస్తాన్ ఈ నియంత్రణరేఖను అతిక్రమించింది. పదేపదే కాల్పులు జరిపి, నియంత్రణరేఖ దాటి వచ్చి స్థావరాలను ఏర్పర్చుకుంది. ఇవన్నీ 1972 నుంచే నడుస్తున్నా అప్పటి ప్రభుత్వాలు వీటిని పట్టించుకోలేదు. నేడు బిజెపి ప్రభుత్వం పై నిప్పులు కురిపిస్తున్న కాంగ్రెస్ హయాంలోనే ఇదంతా జరిగిందన్నది ఈ సందర్భంగా గమనార్హం.

నిజానికి కాంగ్రెస్ ప్రభుత్వాలు గతయాభై ఏళ్ళుగా కేవలం కాశ్మీర్ విషయంలోనేకాదు, దేశ భద్రత, దేశ సమగ్రత, దేశ సరిహద్దుల విషయంలో ఇలాంటి ఘోరతప్పిదాలు చేస్తూనే వచ్చాయి. 1948లో పాక్ చొరబాటుదారులను మన సైన్యం వీరోచితంగా తిప్పికొట్టింది. చివరికి దేశభద్రత దృష్ట్యా అత్యంత కీలకమైన గిల్గిత్, స్కార్దు, బాల్టిస్తాన్, చిత్రల్‌లను చేజిక్కించుకునేందుకు ముందుకు సాగుతుండగా ప్రధానమంత్రి జవహర్లాల్ నెహ్రూ యుద్ధ విరామణను ప్రకటించారు. ఈ వివాదాన్ని ఐక్యరాజ్య సమితి ముందుపెట్టి అంతర్జాతీయం చేశారు. మొట్టమొదట కాశ్మీర్‌ని అంతర్జాతీయం చేసిన పాపం 'పండిత' నెహ్రూదే. నిజానికి 1948లో మనం కాశ్మీరు

వివాదాన్ని ఐక్యరాజ్య సమితికి నివేదించినప్పుడు కూడా ఫూరాన్ నుంచి కర్నాహ్ వరకూ ఉన్న పాకిస్తానీ సైన్యాలు చొరబడి రావడాన్ని మాత్రమే ప్రస్తావించాము. కార్నాహ్ తరువాత ఉన్న కార్గిల్, జొజిలా, ద్రాస్, బటాలిక్, సియాచిన్ వంటి ప్రదేశాలు అప్పట్లో 'వివాదితం' కావు. అందుకే ఐక్యరాజ్య సమితి జనవరి 1, 1948న యుద్ధ విరామ రేఖను ఫూంఛ్ నుంచ్ కర్నాహ్ వరకూ మాత్రమే నిర్ధారించింది.

నిజానికి 1948 తరువాత నుంచీ పాకిస్తాన్ వాస్తవాధీన రేఖ ప్రకారం నిర్ధారితం కాని ప్రదేశాలపైనే దృష్టి సారిస్తూ వచ్చిందన్నది ఈ సందర్భంగా గుర్తుంచుకోవాలి. చైనా - పాక్‌లను కలిపే కారకోరం రహదారి నిర్మాణం 1980వ దశకంలో సియాచిన్ దాడులు, ఇప్పుడు తాజాగా కార్గిల్ ఘటనలు ఆ వ్యూహంలో అంతర్భాగంగానే జరుగుతున్నాయి.

అయితే ఐక్యరాజ్య సమితి యుద్ధవిరామం ప్రకటించిన అనంతరం కూడా పాకిస్తానీ సైనిక దురాక్రమణలు జూన్ వరకూ నిరాఘాటంగా సాగాయన్నది చాలా మందికి తెలియదు. ప్రభుత్వంకూడా అప్పట్లో ఈ విషయాన్ని దాచి ఉంచింది. పాకిస్తాన్ గిల్గిత్, బాల్తిస్థాన్ ప్రాంతాలను జులై 1948లోనే కబ్జా చేసుకుంది. నిజానికి గిల్గిత్, బాల్తిస్థాన్‌లు ఏనాడూ కాశ్మీర్‌లో అంతర్భాగాలు కావు. అంతేకాదు - వాటికి కాశ్మీర్‌తో సాంస్కృతిక సంబంధాలు కూడా లేవు. ఈ క్షేత్రాలకు లడాఖ్, జమ్మూలతోనే ఎక్కువ సంబంధాలున్నాయి. 32,500 మైళ్ళ ఈ గిల్గిత్ భూభాగం వ్యూహాత్మకంగా అత్యంత కీలకమైన ప్రాంతం. గిల్గిత్‌పై ఆధిపత్యాన్ని సాధించిన దేశం సైన్యపరంగా చాలా ప్రభావ వంతమైన, శక్తివంతమైన స్థితిలో ఉంటుంది. గిల్గిత్‌లోని 12 లక్షల జనాభాలో 11లక్షల మంది బాల్తీ భాష మాట్లాడతారు. వారందరూ షియా ముస్లింలే!

యుద్ధ విరమణానంతరం జరిగిన ఈ గిల్గిత్ దురాక్రమణ గురించి డా॥

సుధీర్ చివోరియా వ్రాసిన "ది బ్యాటిల్ ఆఫ్ జోజిలా 1948"లో విపులంగా వివరించారు. గిల్గిత్‌కి అప్పట్లో గవర్నర్‌గా ఉన్న బ్రిగేడియర్ ధన్ సారా సింగ్ డైరీల్లో కూడా గిల్గిత్‌పై పాకిస్తాన్ ఎలా కబ్జా జమాయించుకుందో పొందుపరచబడి ఉంది. పాక్ సమర్థిత ముస్లిం స్కౌట్లు బ్రిగేడియర్ ధన్‌సార సింగ్‌ను కొద్దికాలంపాటూ బందీగా కూడా ఉంచుకున్నారు.

పాకిస్తానీ సైన్యం అప్పట్లో గిల్గిత్‌పై కబ్జా సాధించుకోవడంతోపాటు, కార్గిల్‌ను కూడా కైవసం చేసుకోవాలనుకుంది. కిషన్‌గంగ నది దాటి, గురెజ్, అక్కడినుంచి జోజిలా, ఆ తరువాత కార్గిల్‌లను కైవసం చేసుకోవాలన్నదే పాకిస్తాన్ వ్యూహం. కానీ జోజిలా వద్ద పాటియాలా బెటాలియన్ వీరోచితంగా పోరాడటంతో పాక్ సైన్యాలు వెనుతిరిగి పోయాయి. అప్పట్లో జనరల్ తిమ్మయ్య నేతృత్వంలో ఈ పోరాటానికి వ్యూహం తయారైంది. అప్పట్లో దీనికి ఆపరేషన్ సనాయిపే అని పేరు పెట్టారు.

దురదృష్టవశాత్తూ నాటినుంచి రెండు మూడేళ్ల క్రితం వరకూ ఈ దేశాన్ని పరిపాలించిన కాంగ్రెస్ పాలకులు గిల్గిత్ కీలక ప్రాముఖ్యాన్ని, కార్గిల్ రక్షణ అవసరాల్ని అసలు పట్టించుకోలేదు. కార్గిల్‌లో రవాణా సదుపాయాల్ని మెరుగుపరిచే విషయంలోనూ ప్రభుత్వం ఉదాసీన వైఖరినే ప్రదర్శిస్తూ వచ్చింది. 1965 భారత్ - పాక్ యుద్ధం తరువాత తాష్కెంట్ చర్చల్లోనూ కార్గిల్ భద్రత విషయంలో మన తరఫు నుంచి సరైన ప్రతిపాదనలు చేయలేదు. 1971 సిమ్లా ఒప్పందంలోనూ ఈ కీలకాంశం ఉపేక్షకి గురైంది.

1948 తరువాత జరిగిన అన్ని భారత - పాక్ యుద్ధాల్లో పాకిస్తాన్ శ్రీనగర్ - జోజిలా - కార్గిల్ - లేహ్ రోడ్డును కైవసం చేసుకోవడానికే ప్రయత్నించింది.

కార్గిల్ వాస్తవాధీన రేఖకు కేవలం 8కి.మీ. దూరంలో ఉంది. ద్రాస్ నుంచి సియాచిన్‌కి కేవలం 50కిమీ దూరం మాత్రమే ఉంది. అయినప్పటికీ ప్రభుత్వాలు కార్గిల్ భద్రతను విస్మరిస్తూ వచ్చాయి.

నిజానికి 1948లోనే గిల్గిత్‌ను పాకిస్తాన్ కైవసం కాకుండా నిరోధించగలిగి ఉంటే ఈనాడు కార్గిల్‌లో ఉత్పన్నమైన స్థితి వచ్చి ఉండేదే కాదు. ఆపరేషన్ సనాయ్‌పేని జోజిలా నుంచి గిల్గిత్ వరకూ విస్తరింప చేసి ఉంటే, 51 ఏళ్ళ తరువాత ఈనాడు భారతీయ సైన్యాలకు 'ఆపరేషన్ విజయ్' నిర్వహించా ల్సిన అవసరమే ఉండేదికాదు. మన పాలకుల దూరదృష్టి రాహిత్యానికి, భద్రతా పరమైన విషయాల్లో అవగాహనా లోపానికి ఇది పరాకాష్ఠ!

తమాషా ఏమిటంటే ఐక్యరాజ్యసమితి ప్రకటించిన యుద్ధ విరామం తరువాత గిల్గిత్, బాల్టిస్థాన్‌లపై పాకిస్తాన్ ఆక్రమణ జరపడంపై మనం ఇంతవరకూ ఫిర్యాదు కూడా చేయలేదు. ఈ గిల్గిత్ చుట్టూతా కాశ్మీరీ తీవ్రవాదుల శిక్షణ శిబిరాలు నడుస్తున్నాయి. ఈ గిల్గిత్ కేంద్రంగానే జమ్మూ కాశ్మీర్‌లో ఐఎస్ఐ కార్యకలాపాలు నడుస్తున్నాయి.

భవిష్యత్తులో ఈ క్షేత్రంలో శాంతి భద్రతలు కాపాడాలన్నా, కార్గిల్ రక్షణకు పటిష్టమైన వ్యూహాన్ని రూపొందించాలన్నా స్కార్డు, దన్‌సమ్‌లలోని పాకిస్తానీ సైనిక కేంద్రాలను దెబ్బతీయక తప్పదని రక్షణ విషయాల నిపుణులు పేర్కొంటున్నారు. కార్గిల్, జోజిలా, బటాలిక్, ద్రాస్, సియాచిన్ క్షేత్రాల భద్రతతో గిల్గిత్ ముడిపడి ఉందని, ఎప్పటికైనా మనసైన్యాలు గిల్గిత్‌ను కైవసం చేసుకుని తీరాల్సిందేనని వారు అంటున్నారు. నిజానికి గిల్గిత్ ప్రాధాన్యాన్ని ఇన్నాళ్ళపాటు విస్మరించడం భారత ప్రభుత్వపు ఘోర తప్పదమని వారు అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తున్నారు. గిల్గిత్-బాల్టిస్తాన్‌లోని షియా జనాభా భారత్‌వైపే మొగ్గు చూపారన్న విషయాన్నీ వారు ఈ సందర్భంగా గుర్తుచేశారు.

1950లో చైనా లదాఖ్ క్షేత్రంలోని అక్సాయి చిన్ (అక్షయచిహ్నం)ను కబ్జా వేసింది. పాకిస్తాన్ తన కబ్జాలోని ఆక్రమిత కాశ్మీర్‌లోని ఒక భాగాన్ని 1947-48లోనే చైనాకు ఇచ్చింది. ఇక్కడనుంచే చైనా కారకోరం హైవేని

నిర్మించింది. అప్పుడు కూడా కాంగ్రెస్ ఈ విషయాన్ని వాయిదాకి తోసేసింది.

1987 ప్రాంతంలో మనసైన్యం సియాచిన్ గ్లేసియర్‌పై స్థావరాలను ఏర్పాటు చేసింది. అప్పటినుంచి అమెరికా, పాకిస్తాన్‌లు భారత్‌ను ఈ సియాచిన్‌ను వదిలిపెట్టమని బలవంత పెడుతున్నాయి. అమెరికాకి చెందిన బ్రూక్‌లిన్ ఇన్‌స్టిట్యూట్‌కి చెందిన భారత వ్యవహారాల నిపుణుడు స్టీఫెన్ కూహెన్ సియాచిన్ పోరాటాన్ని ''దువ్వెన కోసం ఇద్దరు బట్టతల ఉన్నవాళ్ళ కొట్లాట''గా విమర్శించారు. అప్పటి ప్రధాని రాజీవ్‌గాంధీ ఈ సియాచిన్‌ను దాదాపుగా పాకిస్తాన్‌కు ధారాదత్తం చేసేందుకు కూడా సిద్ధమయ్యారు. సైనికాధికారుల వత్తిడికి తలొగ్గి చివరికి ఆయన తన ప్రయత్నాల్ని విరమించుకొన్నాడన్నది చాలా మందికి తెలియని విషయం.

కాంగ్రెస్ పుణ్యమా అని కాశ్మీర్‌లో కనీవినీ ఎరుగని మరో విచిత్ర స్థితి వుంది. కాశ్మీర్‌లో మనకు పాకిస్తాన్‌తో మూడు రకాల సరిహద్దులున్నాయి. మొత్తం జమ్మూ కాశ్మీర్‌కి 2062కిలోమీటర్ల సరిహద్దు వుంది. అందులో 1202 కిలోమీటర్లు సరిహద్దు పాకిస్తాన్‌తో ఉంది.

ఇందులో 264కిలోమీటర్ల సరిహద్దును అంతర్జాతీయ సరిహద్దుగా పరిగణిస్తారు. పహాడ్‌పూర్ నుంచి అఖ్నూర్‌సెక్టర్‌లోని మనావర్‌తావి వరకూ ఉన్న ఈ సరిహద్దు అంతర్జాతీయ సరిహద్దు. మనవర్ తావి నుంచి భూరేచక్ వరకూ ఉన్న సరిహద్దుని వర్కింగ్ బార్డర్‌గా పరిగణిస్తారు. భూరేచక్ నుంచి కార్గిల్‌లోనే ఎన్‌జె 9842 అనే పాయింట్ వరకూ ఉన్న సరిహద్దును లైన్ ఆఫ్ కంట్రోల్ (నియంత్రణ రేఖ)గా వ్యవహరిస్తారు. ఇది 814 కిలోమీటర్ల పొడవుంది. ఇక్కడి నుంచి మిగతా సరిహద్దు స్పష్టనిర్ధారణ జరగనేలేదు. ''ఎన్‌జె 9842కి ఉత్తరాన ఉన్న ప్రదేశాలు అంటూ అసందిగ్ధంగా ఒప్పందాలన్నీ వదిలేశాయి. ఈ ప్రాంతాల్లోనే ఆధిపత్యం కోసం పాకిస్తాన్ తహతహలాడుతోంది. ఈ అసందిగ్ధ స్థితికూడా కాంగ్రెస్ పుణ్యమే!

దురదృష్టవశాత్తూ కాంగ్రెస్ గురివిందగింజ లాగా తన తప్పిదాల్ని కప్పిపుచ్చి కేంద్ర ప్రభుత్వంపై పలురకాల విమర్శలు చేస్తోంది. చిన్నచిన్న విషయాల్లోనూ గత ప్రభుత్వాలు చేసిన పొరబాట్లు మనకి ఎంత చేటును కలిగించాయో చెప్పడానికి ఒక్క ఉదాహరణ చాలు!

కార్గిల్ మంచుకొండల చుట్టుప్రక్కల్లో ఒకర్‌వాల్ అనే జాతికి చెందిన ప్రజలు వుంటారు. వీరు దుర్గమమైన కొండ ప్రాంతాల్లో సునాయాసంగా రాకపోకలు సాగిస్తూ వుంటారు. వీళ్ళు కొండ ప్రాంతాల్లో అనుమానాస్పదమైన ఏ చిన్న కదలిక జరిగినా భారతీయ సైన్యాధికారులకు తెలియ చేస్తూంటారు. దానికి ప్రతిఫలంగా సైన్యాధికారులు ఒకర్‌వాల్‌లకు కొంత మద్యం ఉచితంగా సరఫరా చేస్తుంటారు. మూడేళ్ళ క్రితం ప్రభుత్వం ఈపద్ధతిని రద్దు చేసింది.

దానితో ఒకర్‌వాల్‌లు తమ మద్యం అవసరాలకోసం పాక్ ఏజెంట్లను ఆశ్రయించటం మొదలుపెట్టారు. ఫలితంగా మన సైన్యాధికారులకు కీలక సమాచారం అందటం ఆగిపోయింది. ఈ ఒకర్‌వాల్‌లే 1965లోనూ పాక్ దురాక్రమణ తాలూకు తొలి సూచనలు అందచేశారన్నది ఈ సందర్భంగా గుర్తుంచుకోవాలి. అంత కీలకమైన వ్యక్తుల్ని ఉపేక్షించడం చాలా పెద్ద పొరబాటేనని కార్గిల్ సంఘటనలు ఋజువు చేస్తున్నాయి.

## అత్యంత విపరీత పరిస్థితుల్లో పోరాటం

అయితే మన ప్రభుత్వం, వీరజవాన్లూ ఈ దురుద్దేశపూరిత విమర్శల్ని పట్టించుకోకుండా ఒక వ్యూహం ప్రకారం ముందుకు సాగి అత్యంత కఠినమైన పరిస్థితుల్లో పోరాటం సాగించారు. ప్రభుత్వం దౌత్య రంగంలో విజయంపైన విజయం సాధిస్తూంటే, సైనికులు ప్రాణాలను పణంపెట్టి అంగుళం, అంగుళం నేలను తిరిగి ఆక్రమించుకున్నారు.

భారతీయ సైన్య వ్యూహం ప్రకారం కార్గిల్ క్షేత్రాన్ని నాలుగు సబ్‌సెక్టర్లుగా విభజించారు.

1. ముష్కోహ్ లోయ సబ్ సెక్టర్ - ఈ సబ్‌సెక్టర్‌లో, మార్పోలా వంటి అతి కీలకమైన పర్వత మార్గం వుంది.

2. ద్రాస్ సబ్‌సెక్టర్ - ఇందులోనే టైగర్ హిల్, టోలోలింగ్ పర్వతాలున్నాయి. నేషనల్ హైవేపై పట్టు సాధించేందుకు పాకిస్తాన్ ఈ రెండు పర్వతాలపై స్థావరాలను ఏర్పాటు చేసుకుంది. 5140 మీటర్ల ఎత్తున్న టోలోలింగ్ పై నుంచి మర్ఫత్ షుంగ్ నాలా, బూస్గామ్, సాండో నాలాలపై పాకిస్తాన్ నిరంతరం దాడులు జరిపింది.

3. కాక్సర్ సబ్‌సెక్టర్ - కార్గిల్‌కు అతి చేరువగా ఉండేది ఈ కాక్సర్.

4. బటాలిక్ సబ్‌సెక్టర్ - బటాలిక్ అత్యంత కీలకమైన సెక్టర్. యాల్డార్, ముంతో దాలో, జుబార్ హిల్స్, టర్టుక్, కుకెర్‌థాంగ్ సెక్టర్, చోర్‌బత్‌లాల వంటి కీలకమైన ఫీచర్స్ (స్థావరాలు) ఈ సబ్‌సెక్టర్‌లోనే వున్నాయి. సియాచిన్ గ్లేసియర్‌కు వెళ్ళే మార్గాలన్నీ ఈ సబ్‌సెక్టర్‌లో నుంచే వున్నాయి. పాక్‌సైన్యాలు ఈ సబ్‌సెక్టర్‌పైనే తమ అత్యధిక శక్తుల్ని కేంద్రీకరించాయి.

అన్ని చోట్లా పాకిస్తానీ సైనికులు ఎత్తైన స్థావరాలపై కబ్జా చేసుకుని భారతీయ సైనికులపై దాడి జరిపారు. సైన్యం పరిభాషలో "కొండలు సైనికుల్ని తినేస్తాయి" అంటారు. అంటే పర్వతాలపై కూర్చున్న ఒక్కో శత్రువూ వందమంది పెట్టు అన్నమాట. క్రిందనుంచి పాకుతూ అంగుళం అంగుళం పైకి వెళ్ళే సైనికుడి ప్రతి కదలికా శత్రువు అవలీలగా పసిగట్టగలడు. నిజానికి ఇలాంటి పరిస్థితుల్లో ఏ దేశమైనా వేరే సెక్టర్లలో యుద్ధం ప్రారంభించి శత్రువును దెబ్బతీసేందుకు ప్రయత్నిస్తుంది. పాకిస్తాన్ కోరుకున్నదీ ఇదే.

మన ప్రభుత్వం బాగా ఆలోచించి యుద్ధాన్ని విస్తరింపచేసి, పాక్ పన్నాగాల్ని సఫలం కానీయదలచుకోలేదు. కార్గిల్‌కే యుద్ధాన్ని పరిమితంచేసి, కార్గిల్‌లో నియంత్రణ రేఖ రూపు రేఖల్ని మార్చి, సియాచిన్‌ను కబ్జా చేసుకోవాలన్న పాక్ ప్రయత్నాల్ని వమ్ముచేసింది.

అయితే ఇలాంటి పరిస్థితుల్లో అనువైన వ్యూహం ఎక్కువమంది సైనికుల్ని రంగంలోకి దింపడం. సంఖ్యాబలంతో శత్రువును దెబ్బతీయడం. ఇదే వ్యూహాన్ని మన ప్రభుత్వం అనుసరించింది. అంతేకాక సైన్యానికి బాసటగా వైమానిక దాడుల్ని నిర్వహించింది.

పాకిస్తాన్ ఈ రెండింటినీ ఊహించలేదు. మన ప్రభుత్వం 20వేల మంది సైనికుల్ని మోహరిస్తుందని, ముమ్మరంగా వైమానిక దాడుల్ని నిర్వహిస్తుందని అది అనుకోలేదు. భారత్ వైమానిక దాడులన్నీ నియంత్రణ రేఖకు ఇటువైపే జరగడంతో పాకిస్తాన్ ఎదురుదాడి చేసే అవకాశాన్ని కోల్పోయింది. ప్రపంచ దేశాలన్నిటికీ వాస్తవాలు తెలియడానికి ఈ వైమానిక దాడులు అవకాశాన్ని కల్పించాయి.

ప్రముఖ పాత్రికేయుడు దీనానాథ్ మిశ్ర యుద్ధ వ్యూహం గురించిన ఒక ఆసక్తికరమైన అంశాన్ని 'హిందీమిలాప్'లో ప్రచురితమైన ఒక వ్యాసంలో వెల్లడించారు.

యుద్ధం ప్రారంభదశల్లో మన ప్రభుత్వం సైనికాధికారులతో చర్చిస్తూ ఇలాంటి విపత్కర పరిస్థితులను ఇజ్రాయిల్ సమర్థవంతంగా ఎదుర్కొంది. కాబట్టి ఇజ్రాయిల్ నుంచి తగిన సలహాలు తీసుకోవచ్చును. ఈ విషయంపై చర్చలు జరపాల్సిన అవసరంవుందా అని ప్రశ్నించింది. దానికి మన సైన్యాధికారులు జవాబిస్తూ - ''ఇజ్రాయిల్ జరిపిన పోరాటాలన్నీ ఎడారి పోరాటాలే. దానికి కొండలు, పర్వతాలపై యుద్ధానుభవం లేదు. కావాలంటే మనమే ఇజ్రాయిల్‌కి ఈ విషయంలో పాఠాలు చెప్పగలం'' అన్నారట!

ఇది మన సైన్యం ఆలోచనా ధోరణికి, ఆత్మవిశ్వాసానికి అద్దం పడుతుంది. నిజానికి మన ప్రభుత్వం దౌత్య పరంగానూ, సైన్యం రణక్షేత్రంలోనూ సాధించిన విజయాలు అపూర్వమైనవి. పాకిస్తాన్‌తోబాటూ యావత్ప్రపంచమూ ఈ విజయాన్ని చూసి దిమ్మదిరిగి పోయింది.

దురదృష్టవశాత్తూ ప్రతిపక్షమైన కాంగ్రెస్, పత్రికలూ ఈ వాస్తవాల్ని మరిచిపోయి, ప్రభుత్వాన్ని విమర్శించటమే పనిగా పెట్టుకున్నాయి. మొదట్లో ప్రభుత్వం పూర్తిగా విఫలమైంది అనిగగ్గోలుపెట్టాయి. ఆ తరువాత దౌత్యనీతి విషయాన్ని విస్మరించవద్దు అంది. దౌత్యనీతి సఫలం కావడంతో భారత్ సమస్యను అంతర్జాతీయం చేస్తోంది అని విమర్శించింది. మొదట్లో కార్గిల్‌ను రాజకీయాస్త్రంగా వాడుకుంటామని ప్రకటించింది. యుద్ధంలో భారత్ గెలుపొందటంతో ఇప్పుడు కార్గిల్‌ను ప్రచారాస్త్రం చేయవద్దని అంటోంది. దేశభద్రతకు సంబంధించిన కీలక విషయాల్లో ఇలాంటి ధోరణిని అనుసరించటం విషాదకరం.

## పోరుబాటలో వీరజాతి

నెయ్యానికి భారతజాతి
నిండు అమృతభాండం
కయ్యానికి వస్తే అది
మండు అగ్ని గుండం
ఈ నేలను పుట్టిన
శిశువైన ఉక్కుపిండం

ఇదే భారతజాతి ప్రత్యేకత. ఈ విశిష్ట లక్షణమే జాతిని అగాధాల

లోతునుంచి ఆకాశపుటెత్తులకు తీసుకువెళ్లింది. దీనివల్లనే ఈ జాతి శతాబ్దాల దురాక్రమణను తట్టుకుని నిలబడగలిగింది.

ఈ పోరాటపటిమను మరోసారి ఆవిష్కరించింది. కార్గిల్ కదనరంగం. పోరులోని ప్రతిసైనికుడి కథ ఒక సమర భారతమైతే, అతని కుటుంబ సభ్యుల ఆవేశం, యావత్ భారతజాతి ఉద్రేకం ప్రపంచాన్నే ఆశ్చర్య పరుస్తోంది.

కార్గిల్ రణక్షేత్రంలో సైనికులు ప్రదర్శించిన అసమాన ధైర్యసాహసాలను వివరిస్తే ఒక్కో సంఘటనా ఒక మహా సమర కావ్యమౌతుంది. మన సైనికులు చేసిన సాహసాలు మొత్తం ప్రపంచాన్నే నివ్వెరపోయేలా చేశాయి. ప్రపంచంలోని ఏ దేశపు సైనికుడూ ఇలాంటి అద్భుత కృత్యాన్ని చేయ లేడేమోననిపిస్తుంది కూడా!

బీహార్ రెజిమెంట్‌కి చెందిన సిపాయి శత్రుఘ్న సింగ్ బటాలిక్ సెక్టర్‌లోని పాయింట్ 4268 స్థావరాన్ని చేజిక్కించుకునేందుకు వెళ్ళిన సైన్యదళంలోని సభ్యుడు. ఆయుద్ధంలో ఆయన తోటి వారందరూ చనిపోయారు. శత్రుఘ్నసింగ్ కాలికి కూడా బలమైన గాయం తగిలింది. అతను నాలుగు రోజులపాటూ చనిపోయిన వాడిలా పడివున్నాడు. చివరికి పాక్‌సైనికులు భారతీయ జవాన్లెవరూ జీవించిలేరని రూఢి చేసుకునే వరకూ అతను అలాగే పడి ఉన్నాడు. ఆ తరువాత ఒక్కో అంగుళం ముందుకి పాకి, చివరికి కొండ అంచుకి చేరుకున్నాడు. అక్కడినుంచి కిందకి జారి పదకొండు రోజుల పాటూ పాకుతూ పాకుతూ చివరికి భారతీయ స్థావరం చేరుకున్నాడు. అతని తీవ్ర ఆత్మవిశ్వాసం, విజిగీష ఎలాంటి వారినైనా ముక్కున వేలేసు కునేలా చేస్తుంది.

మరో జవాన్ కొండచరియల్లో నాలుగురోజులు మాటువేసి, దాడికి అదునైన సమయంకోసం ఎదురుచూడాల్సి వచ్చింది. అతని దగ్గర కొన్ని

పూరీలు మాత్రమే ఉన్నాయి. అవి చెడిపోయాయని వాటిని అతను విసిరిపారేశాడు. తరువాత ఆకలికి తాళలేక వాటినే ఏరుకుని తిన్నాడు. అయినప్పటికీ వెనుతిరిగి వచ్చేందుకు అతను సిద్ధం కాలేదు.

బటాలిక్ క్షేత్రంలో పోరాడిన నంజినాయుడు అనుభవం ఇంకా విచిత్రమైనది. బటాలిక్‌లోని పాకిస్తానీలపై దాడి చేసేందుకు వెళ్ళిన రెండో దళంలో అతను ఉన్నాడు. నెమ్మదినెమ్మదిగా కొండపైకి ఎగబ్రాకుతూ వెళ్లే క్రమంలో ఒకచోట రాళ్ళమధ్య దాగున్న ఒక భారతీయ జవాన్ కనిపించాడు. అతను ముందు పైకి వెళ్ళిన దళంలో సభ్యుడు. అతను చనిపోయాడనే అందరూ అనుకుంటున్నారు. అతను అక్కడ ఎన్నిరోజులుగా పడి ఉన్నాడో తెలియదు. కేవలం సబ్బు, టూత్‌పేస్ట్ మాత్రమే అతని దగ్గర వున్నాయి. అతను వాటిని తిని ఆకలిని ఆపుకుంటున్నాడు. అతని తూటాలకు ముగ్గురు తీవ్రవాదులు ఖతం అయ్యారు.

17 జాట్ రెజిమెంట్‌కి చెందిన వినోద్‌నాగా మే 30న తన దళంతో పాటూ పింపుల్ 1,2,3 స్థావరాలను చేజిక్కించుకునేందుకు వెళ్ళాడు. అతనిలో పెల్లుబుకుతున్న ఉద్రేకాన్ని, ఆవేశాన్ని చూసి వెంటవున్న వారు సైతం ఆశ్చర్యపోయారు. ''పాకిస్థాన్‌కు గుణపాఠం చెబుతాను. పాకిస్తాన్‌ను నామరూపాలు లేకుండా చేస్తాను'' అని అతను పదే పదే అనేవాడని అతని తోటి జవాన్ ప్రభాతీలాల్ చెప్పాడు. 12మంది శత్రువుల్ని హతమార్చిన తరువాత తూటాకు నేలకొరిగాడు వినోద్.

9వ పారా యూనిట్ కమాండో హేమ్‌సింగ్ సాహసం గురించి వింటే ఎలాంటివారికైనా ఒళ్ళుగగుర్పొడుస్తుంది. టైగర్‌హిల్స్‌ని చేజిక్కించు కునేందుకు వెళ్ళిన కమాండో గ్రూప్‌లో హేమ్‌సింగ్ ఒకడు. శత్రువుకు యాభైగజాల చేరువ వరకూ మన సైనికులు చడీచప్పుడూ కాకుండా వెళ్ళారు. హటాత్తుగా మీదకు దూసుకువచ్చిన మృత్యువును చూసి

పాకిస్తానీల్లో గగ్గోలుపుట్టింది. రేడియోసెట్ల ద్వారా దగ్గర్లోని మిగతా సైనికులను వాళ్ళు కబురందించారు. దాంతో శత్రువుల సంఖ్య ఎక్కువైపోయింది. అయినా మన జవాన్లు పోరాడుతూనే వచ్చారు. ఈ పోరాటంలో హేమ్‌సింగ్ వొళ్ళంతా తూటాలు, స్ప్లింటర్లు గుచ్చుకున్నాయి. మొత్తం రక్తం ముద్దగా మారిపోయినా తిరిగిరానని అతను మొరాయించాడు. అలా రక్తం కారుతున్నా లక్ష్యపెట్టకుండా నలుగురు శత్రువుల్ని అంతం చేసి, ఆ తరువాత తనువు డస్సి స్పృహ తప్పి పడిపోయాడు.

## పిళ్ళా వెంకట నారాయణ రవిప్రసాద్

రాజోలులో పుట్టిపెరిగి ఇంటర్ మీడియట్ దాకా చదువుకున్నాడు. హైదరాబాద్‌లో ఉషాఫాన్స్ కంపెనీలో కొన్నాళ్లు పనిచేశాడు. 1985లో వైమానిక దళంలో చేరాడు. 1994లో ఫ్లైట్ గన్నర్‌గా ఎదిగాడు. 1200 గంటలపాటు హెలికాప్టర్ నడిపిన అనుభవం ఉంది. మే 29న దేశ రక్షణకై అతనికి పిలుపొచ్చింది.

కార్గిల్ సెక్టర్‌లో పాక్ చొరబాటువారుల్ని ఏరిపారేసేందుకు హెలికాప్టర్ దాడుల్ని నిర్వహించేందుకుగానూ అధికారులు అతడిని ఎంపిక చేశారు. అతనితోపాటూ మరో ముగ్గుర్ని కూడా ఎంపిక చేశారు.

రవిప్రసాద్ తన భార్య అనూరాధకు ''ఒక అర్జెంటు పని. ఫ్లైట్‌లో వెళ్ళి వచ్చేస్తాను'' అని మాత్రం చెప్పి బయలుదేరాడు. ఆ హెలికాప్టర్‌లోని మిగతా ముగ్గురి కథలూ ఇలాంటివే!

రాజ్‌కిశోర్ సాహూ ఒరిస్సాలోని కటక్ దగ్గరి చౌద్వార్ గ్రామానికి చెందినవాడు. మొదటి నుంచీ అన్ని పరీక్షలూ ఫస్ట్‌క్లాస్‌లోనే పాసయ్యాడు. 27 ఏళ్ళ నవయువకుడు. 1985 ఆగస్టులో ఎయిర్‌మెన్‌గా చేరాడు. 1989 అక్టోబర్ 3న ఎయిర్‌ఫోర్స్‌లో చేరాడు. 1997మేలో ఫ్లైట్ ఇంజనీర్ అయ్యాడు. సాహూ తల్లి అతడిని వైమానిక దళంలో చేరవద్దంది. అతను

వినిపించుకోలేదు. ఈ ఏడాది ఎలాగోలా అతనికి పెళ్ళి చేసేయాలని ఆ తల్లి తాపత్రయం.

ముహిలన్‌ది బెంగుళూరు. బిఎస్‌సి చదివి, 1993 డిసెంబర్ 18న వైమానిక దళంలో చేరాడు. భార్య బీనా ముహిలన్. కొడుకు చిన్నారి ధృవ ముహిలన్.

నాలుగో వ్యక్తి రాజీవ్ పుండీర్ డెహ్రాడూన్‌లోని బాడ్‌వాలా గ్రామానికి చెందినవాడు. 1961లో పుట్టాడు. సెయింట్ జోసెఫ్ అకాడమీలో చదువు కున్నాడు. 1979లో ఎన్‌డిఎ (నేషనల్ డిఫెన్స్ అకాడమీ)కి ఎన్నికయ్యాడు. 1982లో ఫ్లైట్ లెఫ్టినెంట్ అయ్యాడు.

భార్య షర్మిల, కొడుకు కర్ణ, కూతురు పారుత్, సోదరుడు రోహిత్, తల్లి హేమాపుండీర్ - ఇదీ అతని కుటుంబం.

ఈ నలుగురూ మే 29 అనేకమంది కిరాయి సైనికుల్ని హతమార్చారు. చివరికి శత్రువు స్టింగర్ మిసైల్ తాకిడికి వారి హెలికాప్టర్ కుప్పకూలి పోయింది. ఆ నలుగురికీ మంచుకొండ మృత్యుశయ్యగా మారిందది. దేశ రక్షణలో వీరమరణపు సౌభాగ్యం వారికి దక్కింది.

''వాడికి చిన్నప్పట్నుంచీ సాహస కార్యాలంటే మక్కువ'' కన్నీరు తుడుచుకుంటూ రవిప్రసాద్ మేనమామ వెంకటరమణ చెప్పారు.

''నా కొడుకు దేశం కోసం చనిపోయాడు. నాకెలాంటి దుఃఖమూ లేదు'' హేమా పుండీర్ గర్వంగా చెప్పింది.

''మా వాడు చనిపోలేదు. తప్పిపోయి వుంటాడు. అధికారులు ఎవరినో చూసి మా వాడనుకుని పొరపాటుపడి వుంటారు. మావాడు ఇంటికి వచ్చేస్తాడు! చూస్తూ ఉండండి'' రాజేశ్ కుమార్ సాహూ తల్లి ఆశ ఇది!

కార్గిల్ కర్తవ్య పథంలో బలిదానాలకు, చరమ త్యాగాలకూ కరువా? ప్రతి

జవాను ప్రాణాల్ని పణంగా పెట్టేందుకు, తల్లి ఋణం తీర్చుకునేందుకు తహతహలాడుతున్నాడు.

## మేజర్ శరవణన్

బీహార్‌కి చెందిన మేజర్ మరియప్పన్ శరవణన్ బటాలిక్ క్షేత్రంలోని 14వేల అడుగుల ఎత్తున్న తీవ్రవాదుల స్థావరాల్ని చేజిక్కించుకునే ప్రయత్నాల్లో ప్రాణాలు అర్పించారు. తాను, తన సైనికులతోపాటు ప్రత్యక్షంగా శత్రువులతో బాహాబాహీకి తలపడి, ప్రాణాలర్పించేందుకు ముందు నలుగురు శత్రువుల ప్రాణాలు తీసుకున్నాడు ఆ మేజర్. ఆయనను ''హీరో ఆఫ్ బటాలిక్''గా అభివర్ణిస్తున్నారు.

1972 ఆగస్టు 10న తమిళనాడులోని రామేశ్వరంలో పుట్టిన శరవణన్ నిజంగా భారతీయుడు. పుట్టింది తమిళనాడైనా ఆయన పెరిగింది బీహార్‌లో గయలోని కేంద్రీయ విశ్వవిద్యాలయంలో హైస్కూలు చదువుకున్నారు. తిరుచ్చిలోని సెయింట్ జోసెఫ్ కాలేజీలో డిగ్రీ పూర్తిచేశారు. ఆ తరువాత బీహార్ రెజిమెంట్‌లో 1995లో చేరారు. ఇంతకముందు మేజర్ శరవణన్ అస్సాంలోని తమూల్‌పూర్, బెంగాల్‌లోని కూచ్‌బిహార్, భూటాన్‌లలో పనిచేశారు. కొద్ది రోజుల క్రిందే ఆయన కార్గిల్‌కి బదిలీ అయ్యారు. ఆయన తండ్రి ఆదిమరియప్పన్ కూడా సైన్యంలో లెఫ్టినెంట్ కల్నల్‌గా పనిచేశారు. శ్రీలంకలో భారతీయ శాంతిసేనలో కూడా ఆయన పని చేశారు. 1989లో ఒక రోడ్డు ప్రమాదంలో ఆయన చనిపోయారు. ఆయనకి తల్లి, ఇద్దరు చెల్లెళ్ళు ఉన్నారు. పెద్ద చెల్లెలు చిత్ర డాక్టర్‌గా పని చేస్తోంది. రెండో చెల్లెలు రేవతి కంప్యూటర్ ఇంజనీరింగ్ కోర్సు చదువు తోంది.

బటాలిక్ పోరాటంలో మేజర్ శరవణన్‌తోపాటూ మరో ఏడుగురు జవాన్లు కూడా దేశం కోసం ప్రాణాలర్పించారు. ఒకరిది నాగాల్యాండ్‌లోని దిమాపూర్, మరొకరిది చమౌలీ, ఒకరిది హిమాచల్‌లోని కాంగ్రా,

ఇంకొకరిది హర్యానాలోని మహేంద్రగఢ్, ఇంకొకరిది బెల్గామ్. వీళ్ళ బలిదానం హిందీ కవి ప్రదీప్ వ్రాసిన ఈ పంక్తులను నిలువుటద్దంలా నిలుస్తుందది.

కోయి సిఖ్, కోయి జాట్ మరాఠా
కోయీ గూర్ఖా కోయీ మద్రాసీ
సర్‌హద్ పర్ మర్నేవాలా
హర్ ఏక్‌థా భారత్‌వాసీ
జో ఖూన్ గిరా పర్వత్ పర్
వో ఖూన్‌థా హిందుస్థానీ

దేశ రక్షణ కోసం పాటుపడుతున్న ఈ వీరజవాన్లది ఏ ప్రాంతమైతేనేం. ఏ భాష అయితేనేం! వారందరూ హిందూస్థానీయులే. మంచుకొండలపై పడిన ప్రతి రక్తపు బొట్టూ వారి భారతీయతకు ప్రతిబింబమవుతోంది.

మెకనైజ్డ్ ఇన్‌ఫాంట్రీకి చెందిన 28 ఏళ్ళ మేజర్ రాజేశ్ సింగ్ అధికారి కూడా ఇదే బలిదానపు బాటలో పయనించాడు. బటాలిక్‌లో 14వేల అడుగుల ఎత్తున పాకిస్తానీ ముష్కరులతో పోరాడుతూ పోరాడుతూ ఆయన ప్రాణాలర్పించారు. ఆయన ప్రయత్నాలవల్ల పాకిస్తానీ చొరబాటు దారుల స్థావరం మన చేజిక్కింది. కానీ ఆ ప్రయత్నంలోనే ఆయనకు తూటా తగిలింది.

నాయక్ శివ బసయ్య 28 రాష్ట్రీయ రైఫిల్స్‌కి చెందిన జవాను. మే 27నాడు పోరాటం జరుపుతున్న జవాన్లకు అవసరమైన సామాన్లను తీసుకుని డ్రైవర్‌తోపాటూ ఆయన ఒక శక్తిమాన్ ట్రక్కులో బయలుదేరాడు. నిజానికి వేరే జవాన్ డ్యూటీ వున్నా, బసయ్య తనంతట తాను ఏరి కోరి ఈ బాధ్యత తీసుకున్నాడు. అతి దుర్గమమైన కొండదారిలో ట్రక్కు లైట్లు ఆర్పివేసి ప్రయాణం సాగించారు. బసయ్య దారిచెబుతుంటే డ్రైవర్ ట్రక్కును నడిపించాడు.

హఠాత్తుగా కొండపై నుంచి శత్రువుల కాల్పులు ప్రారంభమయ్యాయి. పై నుంచి దూసుకుపడుతున్న అగ్ని గోళాల వేగాన్ని బట్టి ట్రక్కు వేగాన్ని ఎప్పటికప్పుడు సరిచూసుకుంటూ, ఒడుపుగా తప్పించుకుంటూ వచ్చారు ఆ ఇద్దరూ! అయితే ఒకచోట భయంకరమైన మలుపు ఉండటంతో ట్రక్కు వేగం తగ్గించక తప్పలేదు. ఫలితంగా బసయ్యకు తీవ్ర గాయాలయ్యాయి. ఆ పరిస్థితిలోనూ నిబ్బరాన్ని కోల్పోకుండా డ్రైవర్‌కి సూచనలిస్తూ ట్రక్కును సరైన స్థలానికే ఆయన చేర్పించాడు. ఆ తరువాత 2,3 రోజులు మృత్యువుతో తీవ్రంగా పోరాడి, బసయ్య తనువు చాలించాడు.

## సినీనటిని కుదిపిన కార్గిల్

ప్రముఖ హిందీ చలన చిత్రనటి రవీనాటండన్ కార్గిల్ క్షతగాత్రులను పరామర్శించేందుకు ఢిల్లీ, శ్రీనగర్, కార్గిల్‌లలోని సైనిక ఆసుపత్రుల్ని సందర్శించింది. ఆమె తన ప్రత్యక్ష అనుభవాలను ఇంటర్‌నెట్ హోమ్ పేజీలో వివరించింది. కార్గిల్‌లో వీరుల సాహసాలు ఆమె దృక్పథాన్ని, ఆలోచనా సరళిని ఎలా మార్చివేశాయో ఆమె ఈ వ్యాసంలో విపులంగా వ్రాసింది. సైనికుల వీరగాథల్ని వర్ణిస్తూ ఆమెలోనైన భావావేశం అక్షరాల్లో అతి స్పష్టంగా గోచరిస్తుంది. విలాసవంతమైన జీవితానికి, పాశ్చాత్య సరళికి అలవాటుపడిన ఒక వ్యక్తిని కూడా కార్గిల్ ఎలా ప్రభావితం చేసిందో ఆమె రచన నిరూపిస్తుంది. ఆమె వ్యాసపు పూర్తిపాఠం ఇది.

''సినీ కళాకారుల ప్రతినిధి మండలి కార్గిల్ పోరాటంలో గాయపడ్డ వీర జవాన్లను చూసేందుకు వెళ్తున్నారని తెలిశాక నేనుకూడా వారితోపాటూ వెళ్ళాలని తహతహలాడాను. ఇంతలో కొందరు గాయపడ్డ జవాన్లను కార్గిల్‌నుంచి శ్రీనగర్‌కి, అక్కడి నుంచి ఢిల్లీకి తరలించారని తెలిసింది. గాయాలు మానిన వెనువెంటనే మళ్ళీ యుద్ధరంగానికి తరలివెళ్ళేందుకు వీరజవాన్లు తహతహ లాడుతున్నారని తెలిసి, వారి శౌర్య సాహసాలముందు నతమస్తకురాలినయ్యాను.''

''ఢిల్లీ ఆసుపత్రిలో కోలుకుంటున్న జవాన్లను చూసి నేను తీవ్రమైన భావావేశానికి లోనయ్యాను. నా కళ్ళు చెమర్చాయి గుండె చెరువైపోయింది. కానీ ఎలాగోలా కన్నీటిని ఆపుకున్నాను. ఎందుకంటే - నేను ఏడిస్తే, సినీనటి ఇక్కడకూడా నటించేస్తుందని అనుకుంటారనిపించింది. మా బోంట్ల పరిస్థితి ఎంత విచిత్రమోకదా! ఎలాగోలా నా భావావేశాన్ని అణుచుకోవలసి వచ్చింది.''

''గాయపడి ఆసుపత్రిలో కోలుకుంటున్న సైనికుల దగ్గరికి నేను వెళ్ళినప్పుడు, చాలా మంది నన్ను గుర్తుపట్టనేలేదు. నువ్వు సినిమాల్లో కనిపించే కన్నా పూర్తిగా భిన్నంగా వున్నావని కూడా కొందరు చెప్పారు. ఆంధ్రప్రదేశ్‌కి చెందిన ఒక సైనికుడితో నేను తమిళంలో మాట్లాడాను. నేను నటించిన బంగబంధు సినిమా చూశావా అని అడిగాను. అతను ఉత్సాహంగా తలూపాడు.''

''ఆసుపత్రిలో పంజాబ్‌కి చెందిన వాళ్ళున్నారు. మహారాష్ట్రకి చెందిన వాళ్ళున్నారు. ఇంకా ఇంకా అనేక ప్రాంతాలకు చెందిన వాళ్ళున్నారు. కానీ అక్కడ అందరూ ఒక్కటే! యుద్ధం మనందర్నీ చేరువ చేసింది. నాకు యుద్ధం పట్ల వ్యతిరేకత ఉంది. ఎందుకంటే యుద్ధంవల్ల ఈ నేలపై నుంచి మానవత్వం నశిస్తుంది. ప్రేమ అంతరించిపోతుంది.''

''సినీ కళాకారులు గాయపడిన జవాన్లను కలిస్తే జరిగేదేమిటని కొందరు అడగవచ్చు. వాళ్ళు తమ ఛాతీలపై తూటాలను మోస్తున్నారు. కాబట్టే మనం జీవించగలుగుతున్నాం. వాళ్ళు మన తోబుట్టువులు. వాళ్ళు మనని కాపాడు తున్నారు. వారికి కృతజ్ఞతలు చెప్పుకునేందుకే మేము వచ్చాం.''

''ఆశీష్ అనే ఒక జవాన్ కన్నీరు మున్నీరుగా విలపించటం నేనింకా మరచిపోలేను. అతనికి యుద్ధంలో గాయపడటంవల్ల పక్షవాతం వచ్చింది. చాలా భయంకరమైన నొప్పి ఉంది. కానీ అతని కన్నీరు మళ్ళీ యుద్ధంలో

పాల్గొనే అవకాశం పోయినందుకే తప్ప పక్షవాతం వచ్చినందుకుకాదు. అతనికోసం నేనేమీ చేయలేకపోయానన్న బాధ నన్ను వెంటాడుతోంది. అయితే ఇక దేశవాసుల్లో జాగృతిని నింపాలని నేను నిశ్చయించుకున్నాను. నా స్వరూపం, నా వ్యక్తిత్వం, నా హోదాను ఉపయోగించి ఎంతో కొంత వీరికోసం చేయగలిగితే నా మనసుకు శాంతి లభిస్తుంది. కార్గిల్ సంఘటనలు నా దృక్పథాన్నే మార్చేశాయి.''

''మేము ఢిల్లీ నుంచి కార్గిల్ వెళ్తామని పట్టుబట్టాము. అక్కడికి వెళ్ళడానికి అందరికీ అనుమతి లభించదు. అయినా మేము పట్టు విడవలేదు. మేము మా స్వంత పూచీకత్తుపై వెళ్తున్నట్టు, మాకేదైనా జరిగితే దానికి మేమే బాధ్యులమని లిఖిత పూర్వకంగా వ్రాసి ఇచ్చాం. ఆ తరువాత సాయంత్రం నాలుగున్నరకి శ్రీనగర్ చేరుకున్నాం. అక్కడి ఆసుపత్రిలో ఉన్న వీరజవాన్లను కలుసుకుని, వారి వీర గాథల్ని విన్నాం.''

''కాప్టెన్ సంగ్రామ్ అనే సైనికుడిని మేము కలుసుకున్నప్పుడు, పక్కనే అతని భార్య కూడా ఉంది. యుద్ధంలో కాప్టెన్ సంగ్రామ్ కాలుపోయింది. మేము ఆయన దగ్గర్నుంచి సెలవు తీసుకుంటున్నప్పుడు ఆయన ఏమన్నారో తెలుసా? ఎవరూ ఊహించలేదు! ''రవీనా! ఇంకేముంది. ఇక నా బ్రతుకంతా నిరాశే! నేను దేశం కోసం నా తలను తెగకోసి అర్పిద్దా మనుకున్నాను. కానీ శత్రువు నాకాలును మాత్రమే తీసుకున్నాడు. మళ్ళీ యుద్ధంలో పాల్గొనాలని, ప్రాణాలర్పించాలని మాత్రమే నా ఏకైక కోరిక ''సంగ్రామ్ మాటలువిని అతని భార్య వెక్కి వెక్కి ఏడవనారంభించింది. అప్పుడు నేనన్నాను. ''ఏడవకండి - మీ భర్త నిజమైన హీరో!''

''జవాన్లు సినీహీరో సునీల్ శెట్టిని సులువుగానే గుర్తించారు. వారంతా 'బోర్డర్' (1971 యుద్ధం ఆధారంగా తయారైన సినిమా) సినిమా చూసిన వాళ్ళే. ''నువ్వూ మాలో ఒకడివే'' నంటూ వాళ్ళు సునీల్‌ని పలకరించారు.

''నేను చాలా మంది సైనికుల చిరునామాలు, ఫోన్ నంబర్లూ సేకరించాను. అలాంటి వారితో ఒకడు దీపాల్! దీపాల్ చాలా చిన్న వయసువాడు.

దీపాల్‌కి యుద్ధంలో కుడిచెయ్యి పోయింది. ''నేను మీకు ఉత్తరం వ్రాస్తాను. ఇప్పుడు ఎడమ చేతిలో వ్రాయటం అభ్యసిస్తాను'' అన్నాడతను.

''నేను 1971 యుద్ధాన్ని చూడలేదు. నేను పుట్టింది ఆయేడే! ఇప్పుడు నేను యుద్ధాన్ని చూశాను. ఇప్పుడు నేను ప్రమోద్ మహాజన్ కొడుకుతో కలిసి ఓ కార్యక్రమాన్ని రూపొందిస్తున్నాను. జవాన్ల కోసం సాంస్కృతిక కార్యక్రమాలు ప్రదర్శిస్తాను.''

''శ్రీనగర్ నుంచి సైన్యం హెలికాప్టర్‌పై మమ్మల్ని కార్గిల్ తీసుకు వెళ్ళారు. హెలీకాప్టర్ నుంచి ద్రాస్, బటాలిక్‌లను దాటాము. టైగర్‌హిల్‌ని కూడా చూశాం. కార్గిల్‌లో దిగాం. నిజంగా యుద్ధమే లేకపోతే ఈ ప్రాంతం ఎంత మనోహరంగా ఉండేదో కదా అనిపించింది.''

''కార్గిల్‌లో అంగ్రేజ్‌సింగ్ అనే ఒక జవాన్‌ని కలిశాను. అతను తన అధికారి వెనుక నడుస్తూండగా ఒక తుపాకీ గుండు తగిలింది. ఓకాలు ముక్కముక్కలుగా విరిగి వేరై పోయింది. అంగ్రేజ్‌సింగ్ 'అమ్మా' అని సైతం అనలేదు. వేరుపడిపోయిన ఆ కాలుని తీసుకొని తన మెడకి వేలాడేసుకుని ఒంటికాలిపై ముందుకు నడిచాడు. అంతలో మరో తూటా అతని ఛాతీకి తగిలింది. అయినా అతడు బ్రతికే ఉన్నాడు. అంగ్రేజ్‌సింగ్ నాతో అన్నాడు.'' చూశావా - తూటా ఛాతీకి తగిలిందే తప్ప, వీపుకి కాదు.'' అతను ఈ మాటలన్నప్పుడు రక్షణ మంత్రి జార్జి ఫెర్నాండెజ్ కూడా పక్కనే ఉన్నారు. అంగ్రేజ్‌సింగ్ అసలుసిసలైన హీరో! అక్కడ ఉన్న వారందరి భావనలూ ఇంతే తీవ్రంగా ఉన్నాయి.''

## అమర వీరుల కుటుంబాల అద్భుత దీక్ష

దేశం కోసం ప్రాణాలను ఆహుతి చేసిన వీరజవాన్ల ఆప్తబంధువులు తమ



సాహసాన సంగరాన శత్రుమూక దునుమగా
కృతఘ్నులన్ శతఘ్నితోడ, పేల్చి కాల్చివేయరా



యువ సైనికా నడూ - కదం కదం కలిపి కదులు
జై భారత మాతంటూ - జయమిక మనదేనంటూ



సైనికుడికి తుపాకీ అండ ఎంత అవసరమో, దైవానుగ్రహమూ అంతే అవసరము



నిద్ర సుఖమెరుగదు, బాంబుల మోతనూ పట్టించుకోదు



"క్షాత్ర శక్తికి వినమ్రత ప్రకటిస్తున్న రాజ్యశక్తి"
కార్గిల్‌లో సైనికులకు శాల్యూట్ చేస్తున్న భారత ప్రధాని శ్రీ వాజ్‌పాయ్

## యే వతన్


సార్జంట్ ఆర్. కె. సాహూ


కెప్టెన్ అమోల్ కాలియా


లెఫ్టినెంట్ హనీఫుద్దిన్


మేజర్ రాజేష్ సింగ్ అధికారి


మేజర్ వివేక్ గుప్తా


సుబేదార్ భన్వర్‌లాల్


సుబేదార్ సుమేర్‌సింగ్


లెఫ్టినెంట్ కల్నల్ ఆర్. విశ్వనాధన్


కెప్టెన్ పి.వి. విక్రమ్


ఫ్లయిట్ లెఫ్టినెంట్ యస్. ముహిలన్


స్క్వాడ్రన్ లీడర్ ఆర్. పుండీర్


కెప్టెన్ ఆదిత్య మిశ్రా

## జో షహీద్ హువే హై ఉన్ కీ

# తేరే లియే ....


సార్జంట్ పి.వి.యస్ రవిప్రసాద్


మేజర్ అజయ్‌సింగ్ జస్రోతియా


లెఫ్టినెంట్ కల్నల్ రాఘవన్


మేజర్ మనోజ్ తల్వార్


లెఫ్టినెంట్ సౌరవ్ కాలియా


మేజర్ శరవణన్ మరియప్పన్


పద్మఫణి ఆచార్య


హాజీ బాష


మస్తాన్ వలీ


పోలోజు గోపయ్య


మిట్ట శ్రీనివాస రెడ్డి


లాన్స్ నాయక్ రామ్‌చందర్

## జరా యాద్ కరో ఖుర్బానీ



స్క్వాడ్రన్ లీడర్ అజయ్ అహుజా ధరించిన టోపీని
ముద్దాడుతున్న అతని తల్లి శ్యామ



ఒక కాలు పోతేనేం! కృత్రిమ కాలు
అమర్చుకొనైనా శత్రువును తుదముట్టిస్తానంటున్న
వీర సైనికుడు ఆశీష్ గురుంగ్



తండ్రి చితికి నిప్పంటిస్తున్న స్క్వాడ్రన్ లీడర్ అజయ్ అహూజా ఆరేళ్ళ కొడుకు అంకుశ్



జీవితాంతం కలిసి నడవాల్సిన సహచరుడికి వీడ్కోలు శాల్యూట్ చేస్తున్న
దివంగత మేజర్ వివేక్ గుప్త భార్య కెప్టెన్ రాజశ్రీ గుప్త



ప్రియ పుత్రుడా! నీ వీరత్వానికి శాల్యూట్. ఇక వెళ్ళిరా!!
లెఫ్టినెంట్ అమిత్‌వర్మ శవపేటికకు శాల్యూట్ చేస్తున్న అతని మాతృమూర్తి. ప్రక్కన అమిత్ వర్మ తండ్రి

# 'వి' ఫర్ 'విక్టరీ'



ఇలనెవ్వరికీ తలవంచదులే ప్రచండ భారత ప్రతాపము




వినువీధులలో విహరించునులే భారత వైభవ పతాకం

వ్యక్తిగత విషాదాన్ని దిగమింగి దేశంపై ముంచుకొచ్చిన విపత్తుగురించి, దేశభక్తుడి కర్తవ్యం గురించి మాత్రమే మాట్లాడారు.

షహీద్ సముందర్ సింగ్ తల్లి రామ్‌దేవి ''నాకొడుకు బలిదానం పట్ల నేను గర్విస్తున్నాను. దేశ సరిహద్దుల్ని కాపాడటంలో వీరమరణం పొంది తల్లిపాల విలువను కాపాడాడు'' అంది. మరో అమరజవాన్ జయప్రకాశ్ అస్థికలశాన్ని చూసి తండ్రి రణ్‌సింగ్ అన్నమాటలివి - నా కొడుకు చని పోయినందుకు బాధలేదు. నా బాధంతా ''నా కొడుక్కి సాల్యూట్ చేయలేక పోయినందుకే.'' లెఫ్టినెంట్ సౌరభ్ కాలియా తల్లి ''నా కొడుకును గురించి ఏడవటం అతడిని అవమానించడమే అవుతుంది'' అన్నది. గుంటూరుకి చెందిన అమరజవాన్ షేక్ మస్తాన్‌వలీ తండ్రి అల్లా బక్ష్ ''దేశ రక్షణ కోసం అవసరమైతే మిగతా ఇద్దరు కొడుకుల్ని కూడా పంపిస్తాను'' అన్నాడు.

మేజర్ రాజేష్ అధికారి తల్లి మాలతి అధికారి ప్రతి భారతీయుడి గుండె లోతుల్ని స్పృశిస్తూ ''నేనెందుకు ఏడవాలి? అక్కడ చనిపోతున్న వాళ్ళంతా నా కొడుకులే'' అంది. అమరేశ్‌పాల్ తండ్రి ''నా కుమారుడు బుల్లెట్లకు వెన్ను చూపలేదు. ఛాతీనే చూపించాడు. అదీ నాకు గర్వకారణం'' అన్నాడు. లెఫ్టినెంట్ విజయంత్ థాపర్ తండ్రి వి.ఎన్. థాపర్ వ్యక్తిగత విషాదాన్ని, జాతీయ కర్తవ్య నిర్వహణలో కన్న కొడుకు బలిదానం కావించడాన్ని ఇలా వర్ణించాడు. '' ఇది విచారం వల్ల కలిగిన దుఃఖం కాదు. ఆనందాతిశయంతో కూడిన దుఃఖం!'' హైదరాబాద్‌లోని వనస్థలిపురానికి చెందిన షహీద్ మేజర్ పద్మపాణి ఆచార్య తండ్రి జగన్నాథ్ ఆచార్య కూడా మాజీ సైనికుడే! కొడుకు దేశం కోసం బలిదానం కావించడం ఆయన తనకు గర్వకారణంగా భావిస్తారు. తల్లి విమలా ఆచార్య గుండె దిటవును చూసి మహామహావాళ్ళే నిశ్చేష్టులైపోయారు.

''నాకంట నీటి బొట్టు రాలితే అది జాతికే అవమానం. నా బిడ్డ ఆత్మశాంతికి అవరోధం. అందువల్ల నేనే కాదు, మీరు కూడా కంట నీరు

పెట్టకండి'' - ఇదీ విమలా ఆచార్య మాట! పద్మపాణి తమ్ముడు పద్మ సంభవ్ కూడా కార్గిల్‌లోనే పోరాడుతున్నాడు. అతను ''మాకు విషాదం లేదు. యుద్ధ భూమిలో మరణించడం కన్నా గౌరవం ఏముంది'' అన్నాడు.

నల్గొండకు చెందిన గోపయ్య దేశ సంరక్షణలో అమరుడయ్యాడు. ఆయన తల్లి చంద్రమ్మ మాటలు ఇవి - ''చాలామంది పుడతారు. కానీ దేశం కోసం ప్రాణాలిచ్చేవారు మాత్రం చాలా అరుదు. అలాంటి కొద్ది మందిలో నా కొడుకు ఒకడు కావడం నాకు గర్వకారణం.''

పంజాబ్‌లోని హోషియాపూర్‌కి చెందిన లాన్స్‌నాయక్ షహీద్ అర్జిందర్ (సిఖ్ రెజిమెంట్) తల్లి బక్షీస్ కౌర్ భర్త 1971 యుద్ధంలో వీరమరణం చెందాడు. అప్పటికి పెద్ద కొడుకు అర్జిందర్ మూడోతరగతి, రెండోకొడుకు ఒకటో తరగతి చదువుతున్నారు. మూడోవాడు అప్పటికింకా తల్లి ఒడిని విడిచిపెట్టలేదు. చనిపోయేనాటికి భర్త వయస్సు 28 ఏళ్ళే!

నాలుగువందల రూపాయల పెన్షన్‌తో బక్షీస్ కౌర్ సంసారాన్ని నెట్టుకొచ్చింది. అయితే తన ఇద్దరు కొడుకుల్నీ సైన్యానికే సమర్పించింది. మూడోవాడు సైన్యంలో సెలెక్ట్ కాలేకపోయాడు. ''వాడు సెలెక్ట్ అయ్యుంటే వాడినీ దేశ రక్షణకోసం పంపించి ఉండేదాన్ని'' అందామె. అర్జిందర్ పెద్ద తమ్ముడు కూడా సైన్యంలోనే ఉన్నాడు.

సైనికుడికి దేశం కోసం ప్రాణాలర్పించటం కన్నా ఘనమైన పని ఇంకేముంది. ఆ గౌరవం నా భర్తకి లభించింది. అదే గౌరవం నా కొడుకుకీ లభించింది. నా భర్త ఎంత వీరుడో, నా కొడుకూ అంతే వీరుడు.'' అంది ఆమె. ఆ తరువాత చేతులు పైకెత్తి ''ఇదంతా ఆ వాహె గురుకృప! ఆయన కృప వల్లే నాకీ భాగ్యం దక్కింది. నా కడుపున దేశం కోసం మరణించే కొడుకు పుట్టాడు.''

అర్జిందర్ కి పెళ్ళైంది. ఒక ఏడాది పిల్లవాడు కూడా ఉన్నాడు. ''నా మనవడు కూడా సైన్యంలో చేరతాడు.'' అంది ఆమె!

కార్గిల్ షహీదులు కుటుంబీకులను కదిపితే చాలు. ఇలాంటి కథలు ఎన్నెన్నో వెలువడతాయి. ఇలాంటి మరో సంఘటన ''రాష్ట్రీయ సహారా'' పత్రికలో ప్రచురితమైంది. ఆవార్త అనువాదం ఇది -

''శత్రువుపై పగ సాధించడం రాజపుత్ర ధర్మం. నా భర్తను చంపిన వారిపై పగ తీర్చుకునేందుకు నా కొడుకు కూడా సైన్యంలో భర్తీ అవుతాడు. ఆయనే కనక బ్రతికుంటే నా కొడుకును ఏం చదివించి ఉండేదాన్నో, ఎలా పెంచి ఉండేదాన్నో తెలియదు కానీ, ఇప్పుడు మాత్రం వాడిని సైన్యంలోనే చేర్పిస్తాను. నా భర్త మేజర్ స్థాయికి ఎదగాలని కలలు కనేవాడు. నా కొడుకుని మేజర్గా సైన్యంలో ఎదిగేలా చేయడమే ఆయనకు నేనిచ్చే నిజమైన శ్రద్ధాంజలి.''

'ఆపరేషన్ విజయ్' లో అసువులు బాసిన సుబేదార్ శ్రీపాల్ సింగ్ షెఖావత్ భార్య జ్ఞాన్ కన్వర్ మాటలివి. సుబేదార్ షెకావత్ మందు పాతరలు ప్రేలి మరణించాడు. శ్రీపాల్ సింగ్ షెఖావత్కి మేజర్ కావాలన్న కోరిక బలీయంగా ఉండేది. రిటైర్ అయ్యేముందు మేజర్ కావాలని అతను కలలు కనేవాడు. అందుకే 25 ఏళ్ళ సర్వీసు పూర్తయినా, ఇంకా సైన్యంలోనే కొనసాగేందుకు సిద్ధమయ్యాడు. 8 గ్రనేడియర్స్కి చెందిన ఈ వీర సైనికుడి వంశంలో చాలామంది సైన్యంలో పనిచేశారు. ఇప్పటికీ కొందరు సైన్యంలోనే ఉన్నారు. షెఖావత్ రాజస్థాన్లోని ఝున్ఝునూ జిల్లాలోని టీటన్వాడ్ గ్రామానికి చెందిన వాడు. ఆయన భార్యకి ఎప్పుడు ఉత్తరం రాసినా ''ఇదిగో నేను సరిహద్దులను కాపాడుతున్నాను. నువ్వు ఇల్లు కాపాడు'' అని రాసేవాడని జ్ఞాన్ కన్వర్ చెప్పింది.

మంచుకొండల్లో తుది శ్వాస విడిచిన మరో షహీద్ కర్ణసింగ్ భార్య ఆశాదేవి ఇప్పుడు గర్భవతి. ''నా పుట్టబోయే బిడ్డను కూడా దేశ రక్షణకి అర్పిస్తాను'' అంది ఆశాదేవి దృఢంగా. కర్ణసింగ్ తల్లి ఖీతాబ్దేవి తన మిగతా

కొడుకుల్ని కూడా సైన్యంలో చేర్పిస్తానని అంటోంది. సెలవుల్లో వచ్చినప్పుడు కర్ణసింగ్ నాతో చెప్పాడు. అమ్మా నేను శత్రువును విడిచిపెట్టను. హతమార్చి తీరతాను. అన్నాడు'' అని ఆమె రుద్ధ కంఠంతో చెప్పింది.

## ప్రతి ఊరూ కదిలింది

శ్రీకాకుళం జిల్లాలోని టెక్కలి మండలంలోని గూడెం ఒక చిన్న గ్రామం. ఆ గ్రామంలో సుమారు 50 మంది సైనికులుగా పని చేస్తున్నవారున్నారు. వారిలో పదిమంది జవాన్లు సెలవుమీద గ్రామానికి వచ్చారు. అదే సమయంలో కార్గిల్‌లో కార్చిచ్చు రగుల్కొంది. అక్కడ జరుగుతున్న భీకరమైన పోరును, అక్కడి పరిస్థితి తీవ్రతను తెలుసుకున్న గ్రామంలోని మహిళలు సెలవుపై వచ్చిన సైనికుల్ని, సెలవు రద్దు చేసుకొని తక్షణం యుద్ధక్షేత్రానికి తరలివెళ్ళమని కోరారు. ఆ సైనికుల తల్లులూ, చెల్లెళ్ళే స్వయంగా వీర తిలకం దిద్ది మరీ వారిని సాగనంపారు. కార్గిల్ చొరబాటుదారుల్ని నియంత్రణరేఖ అవతలివరకూ తరిమికొట్టేదాకా తిరిగి రావద్దని చెప్పారు.

లెఫ్టినెంట్ నచికేతను వెతుక్కుంటూ వెళ్ళి అసువులుబాసిన కెప్టెన్ అజయ్ ఆహూజా అంతిమ యాత్రలో వేలాది మంది పాల్గొన్నారు. చుట్టుపక్కల గ్రామాలనుంచి ఎవరెవరో వచ్చి, ఆయన కోసం కంటతడి పెట్టారు. ఆయన విగ్రహాన్ని స్వస్థలమైన కోటాలో ప్రతిష్ఠించేందుకు సంకల్పించారు.

దేశంలోని వివిధ ప్రాంతాల్లో అమరవీరుల అంతిమ యాత్రలు ఇలాగే జరిగాయి. అమర వీరుల చివరి యాత్ర ఒక తీర్థయాత్రగా మారింది. అగణిత ప్రజానీకం అశ్రువులతో వారిని సాగనంపింది.

నిన్నమొన్నటిదాకా గూర్ఖాలాండ్ వేర్పాటువాద ఉద్యమంతో అట్టుడికి పోయిన డార్జిలింగ్‌లో కార్గిల్ అమరవీరుడు గూర్ఖా రైఫిల్స్‌కి చెందిన హవల్దార్ ఎన్.బహదూర్ రాయ్ శవపేటిక వచ్చిన కొద్ది గంటల్లోనే వందలాది గూర్ఖా యువకులు సైనిక కార్యాలయం ముందు బారులు తీరి, తమను సైన్యంలో చేర్చుకొమ్మని అడిగారు. భయంతో కంపించి పోయేందుకు బదులు డార్జిలింగ్ ''ఆయో గూర్ఖా కార్గిల్‌మా'' (పదవోయ్ గూర్ఖా కార్గిల్‌కి పోదాం) నినాదాలతో దద్దరిల్లింది. మాజీ సైనికులు సైతం రణరంగంలోకి ముందుకురికేందుకు మరో అవకాశమిమ్మని ఆవేశంగా అడిగారు.

వైరాగ్యం, ఆధ్యాత్మిక సాధనల్లో లీనమై ఉండే సాధు మహాత్ములు సైతం సరిహద్దులకు తరలివెళ్ళేందుకు, పాకిస్తాన్‌ను పట్టి పల్లార్చడానికి సిద్ధమయ్యారు. దేశ ధర్మాల రక్షణకోసమే సాధు సమాజం ఉందని, తాము ప్రాణాలను సైతం లెక్క చేయబోమని వారు ప్రకటించారు. శ్రీమద్రా మానుజ చినజీయరు స్వాములవంటివారు కూడా జనచైతన్యాన్ని పెంపొందించేందుకు యజ్ఞయాగాదుల్ని నిర్వహించారు.

షియా ముస్లింల మతనేతలైన ఇమామ్‌లు దేశం నలుమూలలనుంచీ వచ్చి కేంద్ర సమాచారశాఖ సహాయమంత్రి ముక్తార్ అబ్బాస్ నక్వీని కలిసి దేశ సరిహద్దుల్లో నేలపై బడిన అమరవీరుల ప్రతి రక్తపు బొట్టుకీ ప్రతీకారం తీర్చుకుంటామని, తమను కార్గిల్‌కి పంపమని కోరారు.

తీహార్ జైలులో వివిధ నేరాలకు శిక్షలు అనుభవిస్తున్న పదివేల మంది ఖైదీలు 3.21 లక్షల రూపాయల్ని సరిహద్దుల్లో పోరాడుతున్న జవాన్లకోసం సమర్పించుకున్నారు. అంతేకాక తమ రక్తాన్ని సైనికులకు ఇచ్చేందుకు సైతం సంసిద్ధులయ్యారు. మమ్మల్ని సరిహద్దులకి పంపండి. ప్రాణాలను అర్పించైనా దేశాన్ని కాపాడుకుంటామని వేడుకున్నారు.

దేశభక్తి భావన ప్రతి ఎదనూ కదిలిస్తుందనడానికి ఢిల్లీ రైల్వేస్టేషన్‌లో

యా త్రికులకు నీళ్ళు అమ్ముకుని పొట్టపోసుకునే రాజు కథే ఒక నిదర్శనం. రాజుకు తన తల్లెవరో తెలియదు. తండ్రెవరో తెలియదు. రాణి అనే ఒకామె మాత్రం అతని బాగోగుల్ని పట్టించుకుంటుంది.

జూన్ 20 నుంచి రాజు ఢిల్లీ రైల్వేస్టేషన్‌లో కనిపించిన ప్రతి సైనికుడికి డబ్బులు పుచ్చుకోకుండానే నీళ్ళు అందిస్తున్నాడు. అంతే కాదు, సగం ధరకి టీ సరఫరా చేస్తున్నాడు. అతనితోపాటు తొమ్మిదేళ్ళ మున్నా, పదకొండేళ్ళ షమీమ్‌లు కూడా సైనికులకు నీళ్ళందించి, వాళ్ళ సామాన్లు మోసి కృతజ్ఞతలు చెప్పుకుంటున్నారు.

''ఒక రోజున పహాడ్ గంజ్‌లో ఒక దుకాణం ముందు నిలుచుని టివిలో వస్తున్న 'బార్డర్' సినిమాను చూశాను. ఆ తరువాత రైలు స్టేషన్‌లో రాత్రి టీ అమ్ముతుండగా ఒక గాయపడిన సైనికుడిని చూశాను. అతను ఆసుపత్రికి వెళ్తున్నాడు. కార్గిల్‌లో ఎలా పోరాటం చేస్తున్నదీ ఆ సైనికుడు నాకు చెప్పాడు. మేము తాగే నీరు తీసుకెళ్ళాం. అవి అయిపోయాయి. రెండు రోజులపాటు తాగేందుకు పచ్చి మంచి నీళ్ళయినా లభించలేదు' అని ఆ సైనికుడు నాతో చెప్పాడు. ఆ రోజునుంచీ సైనికులకు నీరు అందించాలని నిశ్చయించుకున్నాను'' అన్నాడు రాజు.

ఢిల్లీ రైల్వేస్టేషన్‌లో రాజు లాంటి పిల్లలు ఓ రెండు వందలమంది ఉంటారు. అందులో కనీసం పది పన్నెండు మంది అనాథ పిల్లలు ఏదో ఒక రూపంలో సైనికులకు సాయం చేస్తున్నారు. రాజుని తల్లిలా కాపాడుకుంటున్న రాణి మాటల్లో ''వీడికి పిచ్చి పట్టింది. ఇంతకు ముందు 60-70 రూపాయలు రోజుకి సంపాదించేవాడు. ఏదో ఒకరకంగా కడుపు నిండేది. ఆకలి తీరేది. ఇప్పుడు రోజుకి 20-30 రూపాయల్ని మించి తీసుకురావడం లేదు. ఏదన్నా అడిగితే ఇంతలోనే సర్దుకుపొమ్మంటున్నాడు.

ఢిల్లీకి చెందిన పీపుల్స్ యాక్షన్ సంస్థ పిలుపు మేరకు దేశం

నలుమూలలనుంచి వేలాది మంది సైనికులకు బాసటగా లేఖలు రాశారు. ఉద్రేకం, ఉద్వేగం, భావోద్విగ్నత నిండారుతున్న ఆ లేఖలు భారతీయుల భావావేశానికి అక్షర ప్రతీకలు! ఓ 89 ఏళ్ళ వృద్ధురాలు సైనికులు విజయ లక్ష్మితో తిరిగి వచ్చేరోజుకోసం ఎదురుచూస్తున్నాని రాసి, క్రింద 'అమ్మ' అని సంతకం చేసి తన మాతృహృదయాన్ని చాటుకుంది. ముంబాయిలో ముక్కుపచ్చలారని చిన్నారులు సైనికులకు లేఖలు రాసి ప్రోత్సాహాన్ని అందజేశారు.

ఉత్తరాఖండ్‌లోని షిండ్వార్‌లోయలో ఉన్న మాజీ సైనికులు రక్షణమంత్రి జార్జి ఫెర్నాండెజ్‌కి ఒక లేఖ రాసి ఆపరేషన్ విజయ్‌లో పాల్గొనే అవకాశం తమకు కల్పించమని వేడుకున్నారు. ఢిల్లీ ప్రభుత్వంలో సాంఘిక సంక్షేమ శాఖ డైరెక్టర్‌గా పనిచేస్తున్న ఐ.ఎ.ఎస్ అధికారి ఎన్. దివాకర్ మంచు సానువుల్లో శత్రువుని ఎదుర్కొనేందుకు అనుమతినివ్వాల్సిందిగా సైన్య దళాల ప్రధానాధికారిని అభ్యర్థించారు. 1969లో సైన్యంనుంచి రిటైరైన దివాకర్ ఐ.ఎ.ఎస్ పరీక్ష రాసి ఉన్నతాధికారిగా నియమితులయ్యారు. 1971 యుద్ధంలోనూ ఆయన షార్ట్ సర్వీస్ అధికారిగా పనిచేశారు. ''సరిహద్దులో ప్రస్తుతం నెలకొన్న పరిస్థితి నాలోని సైనికుడికి మేల్కొలిపింది. మాతృభూమి కోసం మహత్తరమైన కార్యాన్ని చేపట్టాల్సిందిగా పురి కొల్పింది. సరిహద్దు భద్రతలో ఏ బాధ్యత ఇచ్చినా చేసేందుకు నేను సిద్ధంగా ఉన్నాను.'' అని ఆయన తన లేఖలో వ్రాశారు.

అర్జున్ సింగ్ భాటీ జైసల్మేర్ జిల్లాలోని బడోరా గ్రామానికి చెందిన మాజీ సైనికుడు. 1938 నుంచి 1966 వరకు ఎనిమిది సార్లు శత్రువుతో తల పడ్డాడు. సైన్యంనుంచి రిటైర్ అయ్యాక బార్డర్ హోమ్‌గార్డ్‌గా పనిచేశాడు. ఆయన అతని ముగ్గురు కొడుకులు, మరో అయిదుగురు దగ్గరి బంధువులు కార్గిల్ కదన రంగంలో శత్రువును మట్టి కరిపిస్తున్నారు. అర్జున్ సింగ్‌లో వారి ప్రాణాల గురించి ఏ కోశానా జంకూ పొంకూ లేదు. ''దేశం కోసం చనిపోవడం కన్నా కావలసిందేముంది?''. అంటారాయన.

అర్జున్‌సింహ్ రెండో ప్రపంచ యుద్ధంలో ఆఫ్ఘన్ పఠాన్‌లపై యుద్ధం చేశాడు. ఖుజిలీ కిల్లా, రిజమన్ కంటోన్మెంట్‌లపై జరిగిన దాడుల్లో పాల్గొన్నాడు. 1941లో లాన్స్‌నాయక్ అయ్యాడు. ఆ తరువాత బ్రిటిష్ సైనికుడిగా లిబియా, ఇటలీల్లో జర్మన్లపై పోరాటం జరిపాడు. 1942 లో జపాన్‌పై సింగపూర్‌లో శౌర్యాన్ని చూపించాడు. సింగపూర్‌లో పోరాటం చేస్తున్నప్పుడే అతని హృదయాంతరాళాల్లోని దేశభక్తి జాగృతమైంది. ఆజాద్ హింద్ ఫౌజ్‌తో సంబంధాలు పెంచుకుని, చివరకి సుభాష్ చంద్రబోస్‌కి అనుచరుడయ్యాడు. బ్రిటిషర్లకు వ్యతిరేకంగా జరిపిన పోరాటంలో ఆయన తీవ్రంగా గాయపడ్డాడు. ఆ తరువాత రెండేళ్ళపాటూ అర్జున్‌సింగ్ సైన్యానికి దూరంగా వున్నాడు.

స్వాతంత్ర్యం వచ్చాక ఆయన మళ్ళీ సైన్యంలో చేరాడు. 1948లో కాశ్మీర్‌పై పాక్ దురాక్రమణను ఎదుర్కొన్న భారతీయ సైన్యంలో ఆయన కూడా ఉన్నాడు. అప్పట్లో ఉధమ్‌పూర్, జమ్మూ, నౌషెరా, బేరీ పత్తన్, పాంఛాలలో భీకరమైన పోరు జరిగింది. అందులో ఆయనకూడా పాలు పంచుకున్నాడు. ఆ తరువాత హైదరాబాద్‌ని నిజాం నిరంకుశత్వం చెరనుంచి విముక్తం చేసే పోలీస్ యాక్షన్‌లోనూ ఆయన పాల్గొన్నాడు.

"ఇప్పుడు నేను యుద్ధం చేయలేకపోవచ్చు. కానీ నా యుద్ధానుభవంతో సైనికుల మనోబలాన్ని పెంచగలను. వారికోసం ఏ చిన్నపనిపనైనా, ఏ చిన్న సేవనైనా చేసేందుకు నేను సిద్ధమే" నంటూ సైనికాధికారులకు దరఖాస్తు చేసుకున్నాడా కురువృద్ధుడు.

## నిజంగా అద్భుతమే

రాజస్థాన్‌లోని అల్వార్ జిల్లాలోని బసయీ భోపాల్ గ్రామంలోనైతే అద్భుతమే జరిగింది. 70 ఏళ్ళ ప్రభుదయాళ్ మిస్త్రీ నాడి హటాత్తుగా ఆగిపోయింది. అతను చనిపోయాడని నిర్ధారించుకున్న బంధువులు అతని

పాడెకట్టి, స్మశానానికి మోసుకెళ్ళారు. సరిగ్గా స్మశానం దగ్గరకు వెళ్ళగానే ప్రభుదయాళ్ లేచి కూర్చున్నాడు.

అందరూ స్థాణువులైపోయారు. ప్రభుదయాళ్ బలమంతా కూడ దీసుకుని తమ ఊరికి చెందిన వీరజవాన్ సబ్‌బీర్ శవాన్ని ఒక్కసారి చూసి తనువు చాలిస్తానని చెప్పాడు. అప్పటికింకా సబ్‌బీర్ శవం ఊరికి తీసుకురాలేదు. సాయంత్రం వరకూ ఎదురుచూసి, శవం వచ్చాక దానికి నమస్కారం చేసి, అతను తుదిశ్వాస వదిలాడు.

ఈ సంఘటన జూలై 3న జరిగింది. 'రాష్ట్రీయ సహారా' దినపత్రిక దీనిని ప్రముఖంగా ప్రచురించింది.

మన సైనికుల ఈ నిరుపమాన సాహసం, దేశభక్తితో పాక్ సైనికుల నిరాశా నిస్పృహల్ని పోల్చి చూస్తే రెండు సైన్యాల మధ్య ఉన్న తేడా కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది. పాక్ సైనికులు తమని బలిపశువుల్ని చేశారని అధికారుల్ని తిట్టుకుంటూ ఉన్నారు. బటాలిక్ సబ్ సెక్టార్‌లోని జుబర్ హిల్స్‌లో చనిపోయిన పాక్ సైనికులు డైరీలు, నోట్స్, ఉత్తరాల్లో ఇలాంటి విమర్శలు కోకొల్లలుగా కనిపిస్తాయి. పాక్ నార్తర్న్ లైట్ ఇన్‌ఫాంట్రీకి చెందిన నాయక్ షఫత్ అలీ జేబులో దొరికిన పోస్ట్ చేయని ఉత్తరంలో ''ఇలాంటి చావును అల్లా సైతం స్వీకరించడు.'' జీహాద్ పేరిట తమను బలిపశువులుగా చేసేశారని కూడా అతను వుత్తరంలో వ్రాశారు. మరో సైనికుడు హవల్దార్ షేర్ అలీఖాన్ తన భార్యకు వ్రాసిన ఉత్తరంలో తన చావు ఖాయమని, పిల్లల్ని బాగా చూసుకొమ్మని వ్రాశాడు. అయితే ఎట్టి పరిస్థితులోనూ పిల్లల్ని పాకిస్తానీ సైన్యంలో చేర్చవద్దని అతను మరీ మరీ వ్రాశారు.

టైమ్స్ పత్రికకు ఒక పాకిస్తానీ సైనికుడు ''భారతీయ సైనికుల దాడులకి భయపడి ఆఖరికి మలమూత్రాలు విసర్జించడం సైతం మానుకున్నాం'' అని చెప్పాడు. అతని కథనం ప్రకారం పాక్ ప్రభుత్వపు కాకి లెక్కలకంటే

ఎన్నోరెట్లు ఎక్కువ సంఖ్యలో వాళ్ళ సైనికులు చచ్చిపోయారు. లోయలో అనేక శవాలు కుళ్ళిపోతూండడం కళ్ళారా చూశానని, తన గ్రూప్‌కి చెందిన 17మంది ప్రాణాలు కోల్పోయారని అతను చెప్పారు.

షకూర్ అనే సైనికుడు ఆక్రమిత కాశ్మీర్‌లోని షంగ్రుటీ బేస్‌లో ఉన్న తన బాస్‌కి పంపిన సందేశంలో "నువ్వు మాకు ఎలాంటి సాయం చేయడం లేదు. మేమూ నిన్ను వదిలిపెట్టం. నీ అంతు తేలుస్తాం" అని చెప్పాడు.

పాక్ సైనికులు పంపుకున్న సందేశాలను చూస్తే పాకిస్తానీయుల మనోబలం ఏ స్థాయిలో ఉందో సులువుగా అర్థమవుతుంది.

నాలుగువందల మందికి పైగా సైనికులు ప్రాణాలను కోల్పోయినా భారత దేశంలో సమరోత్సాహం ఉరకలెత్తిందే తప్ప నీరసం, పిరికితనం మచ్చుకైనా కానరాలేదు. ఇదే సంఖ్యలో అమెరికన్ సైనికులు చనిపోయి ఉంటే అణుబాంబులు బోడ్డున దోపుకున్న అమెరికా నీరుగారిపోయి ఉండేది. అలాంటిది భారతీయులు ఈ బలిదానాల్ని గౌరవాలుగా స్వీకరించారు. షహీదుల ఇళ్ళు తీర్థ క్షేత్రాలయ్యాయి. వారి కథలు యువతకి ప్రేరణ అయ్యాయి.

ఇదే భారత్ విజయ రహస్యం. పాకిస్తాన్ పరాజయానికి ప్రధాన కారణం.

# దేశం గురించి పట్టని పత్రికలూ, ప్రతిపక్షాలూ

నేటి కార్గిల్ సంఘటనలకూ, 1965 లో పాకిస్తాన్ దౌష్ట్యానికి కొట్టొచ్చే పోలికలున్నాయి.

అప్పుడు కూడా కాశ్మీరు సమస్య పరిష్కారం పేరిట భారత్‌లో పాకిస్తాన్

చర్చలు జరిపింది. చర్చలు సాగుతున్న తరుణంలోనే దాడికి సన్నాహాలు జరిపింది. ఎవరూ ఊహించని విధంగా పాకిస్తానీ సైనికులు గుజరాత్ సరిహద్దు ప్రాంతమైన రాన్ ఆఫ్ కచ్‌లో జబర్దస్తీగా చొరబడ్డారు. 20 మైళ్ళ పొడువున్న ఒక రోడ్డు సైతం నిర్మించారు. ఈ భూభాగం మాదేనని ప్రగల్భించారు. ఈ సంగతి తెలిసి అక్కడికి వెళ్ళిన సరిహద్దు భద్రతా దళాల్ని చుట్టుముట్టారు.

రాన్ ఆఫ్ కచ్‌ని ఎంచుకోవడం వెనుక ఒక విస్పష్టమైన పన్నాగం ఉంది. రాన్ ఆఫ్ కచ్ ఏడాదిలో 6 నెలలు సముద్రం నీటితో బురద బురదగా ఉంటుంది. మనవైపు సరైన దారులు లేవు. కాగా పాకిస్తాన్‌కి ఆ ప్రాంతం భౌగోళిక స్థితి అత్యంత సానుకూలం! పాకిస్తాన్ ఎత్తు మీద ఉంది. వారివైపు బురద కూడా లేదు. సరిహద్దు వరకూ చక్కని రోడ్లు, దగ్గర్లోనే విమానాశ్రయం ఉన్నాయి.

ఇది జనవరి 1965లో జరిగింది. మార్చి రెండో వారానికల్లా కరాచీ దగ్గర ఉన్న మాలిక్ కంటోన్మెంట్ నుంచి 51 ఇన్‌ఫాంటీ, బ్రిగేడ్‌ని సింధ్-కచ్ సరిహద్దు వద్ద మోహరించింది. ఏప్రిల్ 7 నాటినుంచి భారతీయ సరిహద్దుపై కాల్పులు మొదలుపెట్టింది. హెవీ మోర్టార్లు, శతఘ్నులు గుళ్ళ వర్షం కురిపించాయి.

పాక్ ప్రభుత్వం అడ్డూ అదుపూ లేకుండా ప్రగల్భించనారంభించింది. సరిహద్దుల్లో ఒక్క అంగుళం కూడా వదలబోమని ప్రకటించింది. ఎంతటి యుద్ధానికైనా వెనుదీయమని గర్జించింది. ఈ పర్జన్య గర్జనల మధ్యే భారత్‌తో చర్చలకు తాము సిద్ధమేనని చెప్పనారంభించింది. సరిహద్దు వివాదాన్ని అంతర్జాతీయ వేదికల్లో ప్రస్తావించి ప్రపంచం దృష్టిని ఆకర్షించడం ఒకవైపు, చర్చలకు భారత్‌ను ఆహ్వానించి, మన ప్రభుత్వాన్ని జోకొట్టడం మరోవైపు, సైన్యాల్ని కదం తొక్కించి కచ్ నేలపై ఆకుపచ్చ జెండా ఎగురవేయడం ఇంకోవైపు - ఇదే పాకిస్తానీ పథకం.

1999లోనూ ఇదే కథ పునరావృత్తం అవుతోంది. చిరకాల వైరానికి స్వస్తి చెప్పి భారత్ స్నేహహస్తం చాస్తున్న ముహూర్తంలోనే పాకిస్తాన్ దొంగదెబ్బ తీసింది.

లాహోర్ బస్సుయాత్ర పేరిట ఆలింగనం చేసుకుంటున్నప్పుడే అఫ్జల్‌ఖాన్‌లా వెన్నులో బాకుదించేందుకు పాకిస్తాన్ ప్రయత్నించింది.

అందుకు అత్యంత దుర్గమమైన కార్గిల్ కొండ సానువుల్ని ఎంచుకుంది పాకిస్తాన్! ఏడాదికి నాలుగైదు నెలలు మంచు కప్పి ఉంచే భయంకరమైన మంచుకొండలపై కబ్జా చేసింది. కార్గిల్, ద్రాస్, బటాలిక్, ముష్కో ప్రాంతాల్లో పాకిస్తాన్ వైపు కొండలు క్రమేపీ ఎత్తు పెరుగుతాయి. సరిహద్దు వరకూ అనువైన రవాణా సదుపాయాలున్నాయి. భారత్ వైపు ఈ రెండు అనుకూలాంశాలూ లేవు. కాబట్టి భారతీయ సైనికుల్ని పిట్టల్ని కాల్చినట్టు కాల్చేయవచ్చుననే పాకిస్తాన్ పన్నాగం.

ఈ సంఘర్షణ కొనసాగుతుండగానే వివాదాన్ని అంతర్జాతీయం చేసేందుకు పాకిస్తాన్ ప్రయత్నించింది. ప్రపంచ దేశాలన్నింటిలో అనర్గళ భారత వ్యతిరేక విషప్రచారం చేసింది. ఇంకోవైపు ద్వైపాక్షిక చర్చల పేరిట పాక్ విదేశాంగమంత్రి సర్తాజ్ అజీజ్ భారత్ పర్యటనకు వచ్చాడు.

1965నుంచి 1999 వరకూ పాకిస్తాన్ వైఖరిలో, వ్యూహంలో ఎలాంటి మార్పూ రాలేదు. అమ్ముల పొదిలో అస్త్రాలు మారి ఉండవచ్చు, ఇస్లామాబాద్‌లో గద్దెనెక్కినవారు అప్పుడు అయూబ్‌ఖాన్ అయితే ఇప్పుడు నవాజ్ షరీఫ్ అయి ఉండవచ్చు. కానీ అప్పుడూ ఇప్పుడూ పాక్ ధోరణి మాత్రం ఒక్కటే!

దీనికి కారణం పాకిస్తాన్ పుట్టుకలోనే ఉంది. భారతదేశంపట్ల తీవ్రమైన అసూయాద్వేషాలనుంచే పాకిస్తాన్ పుట్టుకొచ్చింది. భారత్ వ్యతిరేకతే దాని ఊపిరి. భారత్ వ్యతిరేకతే దాని ఆహారం. ప్రపంచపటంనుంచి భారత్‌ను ఖతం చేయడమే పాకిస్తాన్ ఏకైక లక్ష్యం.

యాభైయ్యవ దశకం నాటి మాట! డోరథీ థామ్సన్ అనే మహిళా జర్నలిస్టు ప్రపంచమంతా పర్యటించింది. ఆమె తన అనుభూతుల్ని వివరిస్తూ టర్కీ ప్రజలకు అప్పట్లో రష్యా భూతం తప్ప మరొకటి కనిపించేది కాదని చెప్పింది. అలాగే ఈజిప్టుకు నిత్యమూ ఇజ్రాయిల్‌ను గురించిన ఆలోచనలే! పాకిస్తాన్‌లో ప్రజలు, ప్రభుత్వం, పత్రికలు ఎప్పుడూ భారత్ గురించే ఆలోచిస్తాయని ఆమె చెప్పింది. పత్రికల్లో పాకిస్తాన్ గురించిన వార్తలకన్నా భారత్‌కు సంబంధించిన వార్తలే ఎక్కువ. ప్రతి పాకిస్తానీ నిరంతరం భారత్ గురించే మాట్లాడుతుంటాడని డోరథీ పేర్కొంది.

మరి భారత్ సంగతేమిటి? డోరథీ ఈ ప్రశ్నకు ఆసక్తికరమైన జవాబు చెప్పింది. ''భారతీయులు కేవలం భారతీయులగురించి మాత్రమే పట్టించు కుంటారు.''

కానీ పాకిస్తాన్‌లో మాత్రం ఏం జరిగినా భారత్‌పై విషం వెలిగక్కాల్సిందే! నిప్పులు కురిపించాల్సిందే! ఏ చిన్న సమస్య వచ్చినా భారత వ్యతిరేకతను రేకెత్తించి హడావిడి చేయాల్సిందే. ఈ ధోరణిని చూసి జవహర్‌లాల్ నెహ్రూ అంతటి వ్యక్తికే పాకిస్తాన్ మోసం, ద్వేషాల పురిట్లో పుట్టిందని అనక తప్పలేదు. దేశ విభజన జరిగినప్పుడు పంజాబ్, బెంగాల్‌లు సగమే దక్కాయని, అస్సాం అసలు చిక్కనేలేదని పాకిస్తాన్ పెడబొబ్బలు పెట్టింది. తరువాత కాశ్మీర్ దక్కనందుకు మరింత ద్వేషాన్ని పెంచుకుంది. తాను అమెరికా ఊతకర్ర సాయంతో ఒక్కో అడుగూ వేస్తూంటే, భారత్ ప్రగతి మార్గంలో శరవేగంతో దూసుకుపోవడం చూసి పాకిస్తాన్ ఈర్ష్యను అసూయను పెంచుకుంది.

అందుకే పాకిస్తాన్ పదే పదే భారత్ సరిహద్దులపై దాడులు జరిపింది. 1947-48లో కొండతెగల ముసుగులో పాక్ సైన్యాలు కాశ్మీర్‌ను కబళించ చూశాయి. భారతీయ సైన్యపు బలపరాక్రమాలముందు నిలువలేక చివరికి పాకిస్తానీలు వెన్ను చూపారు. 1965లో కాశ్మీర్‌లో మళ్ళీ దాడి జరిగింది.

''ఆపరేషన్ జిబ్రాల్టర్'' పేర అయిదువేలమంది పాక్ సైనికులు మారువేషంలో కాశ్మీర్‌లోకి చొచ్చుకువచ్చారు. ఆ పన్నాగమూ విఫలమై పోయింది. 1971లో మరోసారి ప్రయత్నం చేసిన పాకిస్తాన్ బొక్కబోర్లా పడింది.

ఇక ప్రత్యక్ష యుద్ధం పనికిరాదని, ప్రచ్ఛన్న యుద్ధం మొదలుపెట్టింది. తీవ్రవాదులు, కిరాయిసైనికుల మద్దతుతో కాశ్మీర్‌లో కల్లోలం సృష్టించింది. ఆక్రమిత కాశ్మీర్‌లో పాకిస్తాన్‌లో పలు శిక్షణ శిబిరాలు ఏర్పాటుచేసి, తీవ్రవాదాన్ని నూరిపోసింది. తీవ్రవాదం పేరుతో వేలాది మందిని పొట్టన పెట్టుకుంది. కాశ్మీర్‌ను మింగేయాలన్న తపనతో కలాష్నికోవ్‌లు, స్టింగర్ మిస్సైళ్ళను తీవ్రవాదులకు సరఫరా చేసింది. కానీ అన్ని పథకాల్లాగానే ఈ పథకమూ విఫలమైపోయింది. కాశ్మీరీ ప్రజలుపాక్ సమర్థిత తీవ్రవాదంతో విసుగు చెందిపోయారు. క్రమేపీ వారి ఆలోచనా ధోరణిలో మార్పు వచ్చింది. భద్రతా దళాల ఎడతెగని ఎదురు దాడులతో తీవ్రవాదుల మనో బలం నీరుగారిపోయింది. కిరాయి సైనికులు, విదేశీ తీవ్రవాదుల సాయంతో కాశ్మీర్‌లో అరాచకం సృష్టించడం కుంటిగుర్రంతో కొండనెక్కడం లాంటిదని తేలిపోయింది.

ఒకవైపు నిర్లజ్జగా భారత్‌పై దురాక్రమణ చేస్తూ, ప్రచ్ఛన్నయుద్ధం సాగిస్తూనే భారత్ తనపై దాడి చేస్తోందని పాకిస్తాన్ మొగసాలకెక్కింది. నిజానికి ఏ దురాక్రమణదారుడూ తాను జరిపింది దురాక్రమణ అని చెప్పుకోడు.

1930 ప్రాంతంలో జపాన్ చైనాపై దాడి చేసింది. చైనా భూభాగంలోనే యుద్ధం జరిగింది. కానీ చైనాయే తనపై దురాక్రమణ జరిపిందని జపాన్ నానాజాతి సమితికి 'మొర' పెట్టుకుంది. ఇక నాజీ నియంత అడాల్ఫ్ హిట్లర్ చెకొస్లవేకియాను కబళించినా, పోలండ్‌ను ఆక్రమించినా 'ఆత్మరక్షణ'

కోసమే చేశాడు. 1962లో చైనా చేసిందికూడా ఇదే! మనపై దాడి చేసి, మన భూభాగంలోకి చొచ్చుకువచ్చి, మననే దురాక్రమణదారుగా చిత్రించింది.

పాకిస్తాన్‌కూడా ఇదే చేస్తోంది. తప్పంతా భారత్‌దేనన్నట్టు ప్రపంచ వేదికలన్నిటిపైనా గొంతూ, గుడ్డలూ చించుకుంటోంది. ఇక పాకిస్తానీ దౌత్యానికి, దౌష్ట్యానికీ తేడాయే లేదు.

కానీ ఇన్ని చేసినా ప్రతిసారీ పాకిస్తాన్‌కి శృంగభంగమైంది. 1965లో జవహర్‌లాల్ నెహ్రూవంటి హిమాలయ సదృశ వ్యక్తిత్వం అంతమై, అంతవరకూ ఎవరికీ తెలియని పొట్టి లాల్‌బహదూర్ శాస్త్రి ప్రధానమంత్రి అయ్యారు. ఆర్థికంగా దేశ పరిస్థితి అంతంతమాత్రంగా ఉంది. అప్పటి ఆర్థికమంత్రి బొచ్చె పుచ్చుకుని దేశదేశాలూ తిరిగి ఆర్థిక సాయాన్ని అర్థించారు. ఇక అంతర్గతంగా దేశం వైరుధ్యాలతో కొట్టుమిట్టాడుతోంది. పంజాబీలు పంజాబీ సుబా కోసం భారీ ఎత్తున ఉద్యమం చేస్తున్నారు. ఇక తమిళనాడులో డిఎంకె అధినేత, ముఖ్యమంత్రి అన్నాదురై భారత్‌నుంచి వేరుపడిపోతామని దబాయిస్తున్నాడు. 1962లో చైనా చేతిలో చిత్తుచిత్తుగా ఓడిపోయిన భారతీయ సైన్యం మనోబలం నీరుగారిపోయి ఉంది. సర్వత్రా నిరాశా, నిస్పృహలు చోటు చేసుకున్నాయి.

ఇంతకన్నా అనుకూలమైన పరిస్థితి ఇకరాదని పాకిస్తాన్ భావించింది. అందుకే భారత్‌పై దాడి చేసింది. కానీ అనూహ్యంగా దెబ్బతిని పోయింది. దిమ్మతిరిగి పాకిస్తాన్ 1971 వరకూ మళ్ళీ యుద్ధం మాటెత్తలేదు.

ఇప్పుడు ఢిల్లీలో వాజ్‌పేయి ప్రభుత్వం విశ్వాస పరీక్షలో ఓటమి పాలైంది. ప్రభుత్వాన్ని ఎలాగోలా చికాకు పెట్టేందుకు ప్రతిపక్షాలన్నీ నిరంతరం ప్రయత్నిస్తున్నాయి. ఎన్నికల వాతావరణం క్రమంగా వేడెక్కు-తోంది. కూడికలు, కుండలీకరణల రాజకీయాల్లో పార్టీలన్నీ తలమునకలై ఉన్నాయి. పాకిస్తాన్ ఇదే అదనుగా భావించి కార్గిల్‌పై దాడి చేసింది.

అయితే భారత్‌ను, భారతీయుల మనస్తత్వాన్ని అంచనా వేయడంలో పాకిస్తాన్ మరోసారి దారుణంగా విఫలమైపోయింది. దేశానికి ప్రమాదం వచ్చిపడినప్పుడు భారతీయులందరూ ఒక్కటైపోతారు. జాతి, ప్రాంత, భాష, వర్ణభేదాలు పేకమేడల్లా కూలిపోయి, ఒక్క భారతీయత మాత్రమే మిగులుతుంది. కుగ్రామంలో నివసించే వ్యక్తి నుంచి మహానగరంలో ఉండే వాడివరకూ, సామాన్యుడి నుంచి మాన్యుడి వరకూ విద్యుత్స్పర్శకితులై పోతారు. రక్తదానం చేసేందుకు క్యూలు కడతారు. సైనికులకు సహాయం చేసేందుకు బారులుతీరి నిలబడతారు. తమ జీతాల్లో నుంచి ప్రధానమంత్రి రిలీఫ్ ఫండ్‌కి సమర్పించుకుంటారు. ప్రతివ్యక్తీ ఒక శక్తిగా మారిపోతాడు. 1962లో ఇదే జరిగింది. 1965లో ఇదే జరిగింది. 1965లో అప్పటి ప్రధాని లాల్‌బహదూర్ శాస్త్రి దేశంలో ఆహార కొరత తీర్చేందుకు, ఒక్కపూట భోజనం మానమని పిలుపునిచ్చారు. నేటికీ ఆ వ్రతాన్ని నిష్ఠగా పాటిస్తున్న వారు ఎందరో ఉన్నారు. 1962లోనూ, 1965 లోనూ మహిళలు స్వచ్ఛందంగా తమ ఆభరణాలను వొలిచి ఇచ్చేశారు. 1971లో లక్షలాది బంగ్లాదేశ్ శరణార్థుల కోసం ప్రతి భారతీయుడూ సాయంచేశాడు. ప్రజలు సైన్యంతో పాటు సమ ఉజ్జీలుగా నిరుపమాన త్యాగాలు చేసేందుకు పోటీలు పడ్డారు.

మన్ను తిన్న పాములా పడి ఉండే సగటు భారతీయుడిలో హఠాత్తుగా మహా చైతన్యం రావడం శత్రువును కంగు తినిపిస్తుంది. కార్గిల్ దాడి విషయంలోనూ ఆ మహాద్భుతమే మళ్ళీ కనిపించింది. జాతి యావత్తూ ఒక్క గొంతుతో ప్రతి ధ్వనించింది. ఈ ప్రతిస్పందనకి దేశంలోని పంచమాంగ దళాలు సైతం భయపడిపోయాయి. దీనికి కారణం సగటు భారతీయుడి భావతీవ్రత!

## ప్రతిపక్షాలకు కలగలేదు జ్ఞానోదయం

దురదృష్టవశాత్తూ జనంలో ఇంతటి జాగృతి వచ్చినా, మన

ప్రతిపక్షాలకు, పత్రికలకు మాత్రం ఇసుమంతైనా జ్ఞానోదయం కలగలేదు. ప్రధానప్రతిపక్షమైన కాంగ్రెస్, తొలినుంచీ భారత వ్యతిరేక ధోరణినే అవలంబిస్తూ వచ్చిన కమ్యూనిస్టులా దేశంపై ముంచుకొచ్చిన ఈ పెనుముప్పును బిజెపి ప్రభుత్వాన్ని దెబ్బతీసే సాధనంగా వాడుకునేందుకు ప్రయత్నించాయి. నిన్న మొన్నటి వరకూ దేశభక్తిని జింగోయిజం, దురహంకారవాదం అన్న ఈ రెండు పార్టీలూ రాత్రికి రాత్రి ప్లేటు ఫిరాయించి, అపరదేశభక్తిని ప్రదర్శించనారంభించాయి.

పాకిస్తాన్ దుందుడుకు వాదాన్ని విమర్శించాల్సింది పోయి, ''లాహోరు బస్సుదౌత్యం విఫలమైపోయిందోచ్'' అంటూ ఆనందంతో కేరింతలు కొట్టాయి - ఢిల్లీలోనైతే కాంగ్రెస్ పార్టీ ఓ బస్సు నమూనాను తయారు చేసి, దానిని తలకిందులుగా చేసి, ''తలకిందులైన బస్ దౌత్యం'' అంటూ వీధివీధినా ప్రచారం చేసింది. చివరికి ప్రజలు ఛీకొట్టడంతో తప్పనిసరై ఈ దుష్ప్రయత్నాన్ని మానుకోవాల్సి వచ్చింది. కార్గిల్‌లో నిప్పులు చెలరేగు తుంటే, ఆ నిప్పుల్లో 'రాజకీయచలి' కాచుకునేందుకు నిర్లజ్జగా కాంగ్రెస్ ప్రయత్నించింది. లాహోర్ బస్ దౌత్యం విఫలమైంది కాబట్టి వాజ్‌పేయికి అధికారంలో కొనసాగే హక్కు లేదని కాంగ్రెస్ అధికార ప్రతినిధులు పదే పదే మంత్రంలా జపించ నారంభించారు.

1971లో కాంగ్రెస్ ప్రధానమంత్రి ఇందిరాగాంధీ, పాక్ ప్రధాని జుల్ఫికర్ అలీ భుట్టోల మధ్య సిమ్లా ఒప్పందం జరిగింది. ఆ ఒప్పందంలో వివాదాలను ద్వైపాక్షికంగా మాత్రమే పరిష్కరించుకోవాలని, మూడో శక్తి జోక్యం అవసరంలేదని స్పష్టంగా పేర్కొనడం జరిగింది. అంతేకాదు పరస్పరం భౌగోళిక సార్వభౌమత్వాన్ని గుర్తించి, గౌరవించాలని కూడా ఇరు దేశాలు నిర్ణయించుకున్నాయి. సిమ్లా ఒప్పందంలోని నాలుగో క్లాజు ప్రకారం ఇరు దేశాలూ కాశ్మీరులో నియంత్రణ రేఖను గౌరవించాలి.

అయితే గత 28 ఏళ్ళుగా పాకిస్తాన్ ప్రతి క్లాజుని తుంగలో తొక్కింది.

అంతేకాదు సిమ్లా ఒప్పందాన్ని గడ్డిపోచలా తీసిపారేసింది. ఇవన్నీ కాంగ్రెస్ హయాంలోనే జరిగాయి. కాంగ్రెస్ దీనిని హాయిగా మరచిపోయి, బిజెపి పై మాత్రం విమర్శనాస్త్రాలను సంధిస్తోంది. కాంగ్రెస్ ఏలుబడిలోనే కాశ్మీరు, పంజాబుల్లో తీవ్రవాదం తారాస్థాయికి చేరుకుంది. దీనిని కాంగ్రెస్ ఎందుకు నివారించలేక పోయింది.

స్వర్ణమందిరంలో తీవ్రవాదులు ఆంటీ ట్యాంక్ మిసైళ్ళను, రాకెట్ లాంచర్లను పోగుచేసి, అడుగడుగునా బంకర్లు ఏర్పాటు చేస్తుంటే కాంగ్రెస్ ప్రభుత్వపు గూఢచర్య విభాగం ఏం చేసింది? ఇక్కడ గూఢచర్య వైఫల్యం బాధ్యత కాంగ్రెస్ ప్రభుత్వానిది కాదా? కాంగ్రెస్ ప్రభుత్వాల హయాంలోనే హజరత్‌బల్‌ను కబ్జాచేసిన పాక్ కిరాయి సైనికులకు చికెన్ బిరియానీలు సరఫరా చేయటం జరిగింది. వారికి పాకిస్తాన్ తిరిగి వెళ్ళేందుకు ''సేఫ్ ప్యాసేజ్'' కూడా ఇవ్వటం జరిగింది. ఇవన్ని వైఫల్యాలకు కారణమైన కాంగ్రెస్ నిర్లజ్జగా గతాన్ని మరిచి, బిజెపి ప్రభుత్వంపై విమర్శల వర్షం కురిపిస్తోంది.

ఇవే కమ్యూనిస్టు పార్టీలు, ఇవే కాంగ్రెస్‌లు ఐఎస్ఐ కార్యకలాపాల గురించి మాట్లాడితే మైనారిటీ మనోభావాల సాకును చూపించాయి! ఐఎస్ఐ సమస్య గురించి మాట్లాడిన వాడిని హిందూ మతోన్మాద శక్తిగా విమర్శించారు. రక్షణ వ్యయాన్ని తగ్గించాలని సదా గగ్గోలు పెట్టిందే ఈ పార్టీలు. అసలు కాశ్మీరును రావణకాష్ఠంలా రగిలించిన పాపం కాంగ్రెస్‌దికాక, మరెవరిదౌతుంది? కాశ్మీరు సమస్యను అంతర్జాతీయ వేదికలకు ఎక్కించింది. కాంగ్రెస్ కాక ఇంకెవరు? అక్షయ చిహ్నం (ఆక్సాయిచిన్) చైనా ఇనుపగుప్పిట్లోకి పోతుంటే చూస్తూ ఊరుకోవటమే కాక, ''అక్కడ గడ్డిపోచసైతం మొలవదు. అలాంటి భూమి ఉంటేనేం, పోతేనేం?'' అన్నది కాంగ్రెస్ కాక ఇంకెవరు? 1965లో, 1971లో సైన్యం సాధించిన విజయాల్ని చర్చా వేదికలపై బలిపెట్టిన పాపం కాంగ్రెస్‌దికాక ఇంకెవరిది? అలాంటి కాంగ్రెస్ బిజెపి ప్రభుత్వాన్ని విమర్శించబూనుకోవటం ఎంత విచిత్రం?

ఇక పత్రికల సంగతి ఎంత తక్కువగా చెప్పుకుంటే అంత మంచిది. కార్గిల్‌లో సంఘర్షణ మొదలు అయినప్పుడు మన పత్రికలన్నీ క్రికెట్ వార్తలను పెద్ద పెద్ద హెడ్డింగ్‌లతో ప్రచురించేందుకు పోటీలు పడుతున్నాయి. ప్రపంచకప్ క్రికెట్‌ని పత్రికలు, కార్పోరేట్ సంస్థలు, బహుళజాతి సంస్థలు కలిసి 800 కోట్ల రూపాయలు వ్యాపారంగా మార్చేశాయి. అన్ని పత్రికలూ క్రికెట్ అనుబంధాల్ని, స్పెషల్ పులౌట్‌లను ప్రచురించేందుకు తహతహలాడాయి. మొదట్లోనైతే కార్గిల్‌కన్నా క్రికెట్‌కే ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చాయి మన పత్రికలు.

ఆ తరువాత చాలా పత్రికలు తమ బాధ్యతను గుర్తెరిగి ప్రవర్తించినా, కొన్ని పత్రికలు మాత్రం తమ అలవాటు మానుకోలేదు. కొన్ని పత్రికలు సూటిగా భారతవ్యతిరేక ధోరణిని అవలంబించాయి. ఉదాహరణకి ఒక ప్రముఖ ఇంగ్లీషు వార పత్రిక ''సైనికులకు సరైన దుస్తులు లేవు. వారివద్ద ఉన్న ఆయుధాలు ఎందుకూ పనికిరావు'' అంటూ ఫోటోలతో సహా వ్యాసాలను ప్రచురించింది. అదే పత్రిక యుద్ధం హోరాహోరీగా జరుగుతుండగా పాకిస్తాన్ మాజీ సైన్యాధ్యక్షుడు జెనరల్ మీర్జా అస్లం బేగ్ వ్యాసాన్ని ప్రముఖంగా ప్రచురించింది.

ఒకానొక తెలుగు దినపత్రిక మన సైనికులు సాధించిన విజయాలు, అసలు విజయాలే కావని పేర్కొంది. అంతేకాదు ఊహాత్మకమైన బొమ్మలు గీసి, మన సైనికులు అసలు ఒక్కడుగు కూడా ముందుకు పోలేదని చెప్పే ప్రయత్నం చేశాడు. కాశ్మీరీ తీవ్రవాద నేతలతో దగ్గరి సంబంధాలున్న ఒక ప్రముఖ జర్నలిస్టు కార్గిల్‌కి వందలాది మైళ్ళ దూరంలో వుంటూ ఇలాంటి కల్లిబొల్లి కబుర్లు వ్రాశాడు.

రెండో ప్రపంచ యుద్ధకాలంలో అమెరికన్ పత్రికలు ఎంత బాధ్యతాయుతంగా ప్రవర్తించాయో పోల్చిచూస్తే, మన దేశానికి చెందిన కొన్ని పత్రికల మనో భూమిక బట్టబయలు అవుతుంది.

## అమెరికన్ పత్రికలనుంచి నేర్చుకుందాం

రెండో ప్రపంచయుద్ధం హోరాహోరీగా జరుగుతున్న రోజుల్లో జపాన్ అమెరికాపై దాడిచేసేందుకు ఒక అద్భుతమైన పథకం వేసింది. 1944 నవంబర్ నుంచి 1945 ఏప్రిల్ లోపున జపాన్ 9000 బెలూన్లను తయారు చేయించింది. ఈ బెలూన్లను జపాన్ నుంచి అమెరికా దిశగా పంపించాలని వ్యూహం రూపొందించటం జరిగింది.

30 నుంచి 35వేల అడుగుల ఎత్తున ప్రయాణం చేసి పసిఫిక్ మహా సముద్రాన్ని దాటి అమెరికా చేరుకోగలిగేలా ఆ బెలూన్లను రూపొందించటం జరిగింది. వాటినిండా మందుగుండు సామగ్రి, నిప్పు రగిలించే పదార్థాల్ని నింపి జపానీయులు పంపించారు. అవి అడవుల్లో పడితే భారీ ఎత్తున మంటలు లేవవచ్చు. నగరాల్లో పడితే భయంకరమైన పేలుళ్ళు సంభవించ వచ్చు. కొన్ని బెలూన్లలో బాక్టీరియాలు, విషక్రిముల్ని కూడా నింపి పంపించారు. నవంబర్ 1, 1944 నుంచి రోజుకు వంద బెలూన్ల చొప్పున జపాన్ పంపించింది.

1944, నవంబర్ 4న తొలి బెలూన్‌ని అమెరికన్లు గుర్తించారు. సముద్రంపై తేలియాడుతున్న ఒక బెలూన్‌ను వాళ్ళు పట్టుకున్నారు. దానిలో ఉన్న గుర్తులు, అక్షరాలను బట్టి అది జపాన్‌దని గుర్తించారు. మరు క్షణం నౌకాదళం, ఎఫ్.బి.ఐ., ఫారెస్టు రేంజర్లు అప్రమత్తులయ్యారు.

అమెరికన్లు ఆ బెలూన్లను వాషింగ్టన్‌లోని నౌకాదళ పరిశోధనాకేంద్రానికి, కాలిఫోర్నియా ఇన్స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీకి పంపించారు. బెలూన్లకు అంటుకున్న ఇసుకను బట్టి, ఆ బెలూన్లను జపాన్‌లోని అయిదు ప్రదేశాల్లో ఏదో ఒక చోట నుంచి వచ్చాయని గుర్తించారు. వైమానిక దళాలు జపాన్ ఆకాశమార్గాలగుండా ప్రయాణించి అనుమానాస్పదమైన అయిదు

ప్రదేశాల ఫోటోలు తీశాయి. అందులో ఒకచోట బెలూన్ల తయారీ కేంద్రం ఉన్నట్టు వెల్లడైంది.

అమెరికన్లకు జపానీయుల వ్యూహం ఏమిటో త్వరలోనే అర్థమైపోయింది. జూలై నుంచి సెప్టెంబర్ మధ్యలో ఈ బెలూన్లను ప్రయోగిస్తే అమెరికాకి భారీనష్టం జరిగే అవకాశాలున్నాయి. అడవుల్లోని కలప సైనికులకి చాలా అవసరం కూడా! అందుకే పారాట్రూపర్లను, ఫారెస్ట్ రేంజర్లను, సాధారణ పౌరులను సమీకరించి అమెరికన్ ప్రభుత్వం అడవుల్లో రక్షణ వ్యవస్థను ఏర్పాటు చేసింది. ఇటు బ్యాక్టీరియా వల్ల ప్రమాదాలు రాకుండా చూసేందుకు డాక్టర్లు, వ్యవసాయ నిపుణులను అప్రమత్తం చేసింది. కొత్త రోగాలు, తెగుళ్ళు, చీడపీడలు ఏమైనా వస్తే తక్షణం తెలియజేయాలని రైతులను ఆదేశించింది. కీలక ప్రాంతాల్లో గ్యాస్ మాస్క్‌లు తదితర పనిముట్లు, పరికరాలను సిద్ధం చేసి ఉంచింది.

ఇదంతా ఎంత భారీ సన్నాహమో ఎవరైనా తేలిగ్గా ఊహించుకోగలరు. అమెరికా అంత విశాలమైన దేశంలో అడవుల్లో, గ్రామాల్లో, నగరాల్లో భద్రతా చర్యలు చేపట్టడం, సైన్యం, నౌకాదళం, ఫారెస్టు రేంజర్లు, రైతులు, సాధారణ పౌరుల్ని సమాయత్తం చేయడం మామూలు విషయం కాదు.

జపానీయులు సరిగ్గా ఇదే అంచనా వేశారు. ఇన్నివేల బెలూన్లు అమెరికాలో పడినా, అవి విస్ఫోటనం చెందినా అక్కడి పత్రికల్లో తప్పనిసరిగా వార్తలు వచ్చి తీరుతాయి. ప్రభుత్వం, ప్రజల ప్రతిక్రియలు పత్రికల్లో పతాకశీర్షికలు కావడం ఖాయం. తద్వారా తమ బెలూను యుద్ధపు సాఫల్య, వైఫల్యాల్ని తేలిగ్గా అంచనా వేసుకోవచ్చు.

జపానీయుల వ్యూహాన్ని ఊహించిన అమెరికన్ ప్రభుత్వం కూడా ఈ భారీ సన్నాహాలకు కనీస ప్రచారమైనా కల్పించలేదు. అమెరికన్ పత్రికలు కూడా తమంతటతాము బెలూన్లకు సంబంధించిన వార్తల్ని ప్రచురించ కూడదని నిర్ణయించుకున్నాయి. కొన్ని చోట్ల బెలూన్లు పేలి ప్రజలు చనిపోయారు. కానీ పత్రికలు ఆ వార్తల్ని ప్రచురించలేదు.

అమెరికన్ పత్రికల్లో బెలూన్లు, పేలుళ్ల వార్తలకోసం జపానీయులు కళ్ళలో వత్తులు వేసుకుని వెతికారు. ప్రపంచంలోని అతిపెద్ద ప్రజాస్వామ్య దేశమైన అమెరికాలోని పత్రికలు ఈ వార్తల్ని ప్రచురించి తీరుతాయని జపానీయులు భావించారు. ఆరునెలల పాటు వెతికినా ఒక్క వార్తా కనిపించకపోవడంతో తమ బెలూన్ల వ్యూహం పూర్తిగా విఫలమైందేమోనని జపానీయులు భావించడం మొదలుపెట్టారు. అసలు బెలూన్లు అమెరికా చేరలేదేమోనని అవి ఎక్కడో సముద్రంలోనే పడిపోయి ఉంటాయని వారు అనుకున్నారు. చివరికి బెలూన్ల యుద్ధం ఓ వృధా ప్రయత్నమన్న నిర్ణయానికి వచ్చేశారు. ఏప్రిల్ 1945 నుంచి బెలూన్లు పంపటం హటాత్తుగా ఆగిపోయింది. జపానీయుల అత్యద్భుత వ్యూహం విఫలమైపోయింది.

రెండో ప్రపంచయుద్ధం ముగిసిపోయిన తరువాత 1948లో అమెరికా పశ్చిమ కమాండ్ సైన్యాధికారి బ్రిగేడియర్ జనరల్ డబ్ల్యు.హెచ్. విల్బర్ జపాన్‌లో పర్యటించారు. అప్పుడు ఆయన బెలూన్ యుద్ధపు వ్యూహకర్త అయిన జనరల్ కుసాబాను కలుసుకుని దీనిగురించి చర్చించారు. జపాన్ 9000 బెలూన్లను పంపించింది. అందులో కనీసం 10శాతమైనా అమెరికా చేరతాయని ఆశించింది. అయితే పత్రికల్లో వాటి గురించిన ఒక్క వార్తైనా రాకపోవడంతో చివరికి ఉన్నతాధికారులు ''నీ బెలూన్లు అమెరికా చేరడం లేదు. చేరి ఉంటే ఆ వార్త అక్కడి పత్రికల్లో తప్పకుండా వస్తుంది.

అమెరికన్లు ఎక్కువకాలం నోరు మూసుకుని ఉండలేరు'' అని కౌసాబాకు చెప్పారు. దానితో బెలూన్ల యుద్ధం అంతమై పోయింది.

ఈ మొత్తం ఉదంతంలో అతికీలకమైన పాత్రను నిర్వహించింది ఎవరు? నిస్సందేహంగా అమెరికన్ పత్రికలే! పత్రికలు తమ బాధ్యతను గుర్తెరిగి, ప్రవర్తించి ఉండకపోయినట్టయితే ఏం జరిగి ఉండేదో ఊహించడం కష్టమేమీకాదు.

అమెరికన్ పత్రికల ఈ బాధ్యతాయుతమైన ప్రవర్తనతో మన పత్రికలను పోల్చి చూస్తే బాధకలుగుతుంది. యుద్ధాన్ని కవర్ చేసేందుకు వెళ్ళిన విలేకరులు కూడా సైన్యానికి ఆటంకంగా తయారయ్యారు. బాంబుల వర్షం కురుస్తుండగా కొన్ని టీవి ఛానెళ్ళ విలేఖరులు ''బాంబు మాకు నలభై మీటర్ల దూరంలో పడింది, డెబ్బయి మీటర్ల దూరంలో పడింది'' అంటూ సెటిలైట్ ఫోన్ల ద్వారా వార్తలు పంపించారు. పాకిస్తానీలు ఈ సందేశాలను పసిగట్టి, భారతీయ స్థావరాలపై గురిచూసి దాడులు చేశారు. ఒక మహిళా రిపోర్టర్ అత్యుత్సాహంవల్ల నలుగురు జవాన్లు ప్రాణాలు కూడా కోల్పోయారు. ఇలాంటి విలేఖరుల వల్ల పలుసార్లు సైన్యానికి చివరిక్షణంలో వ్యూహాన్ని మార్చుకోవలసిన పరిస్థితి ఎదురైంది.

ఇదీ మన ప్రతిపక్షాలు, కొన్ని పత్రికలు పోషించిన పాత్ర!

# పచ్చడైపోయిన పాక్ వ్యూహం

కార్గిల్ యుద్ధం పాకిస్తాన్‌ను పూర్తిగా మట్టికరిపించింది. ప్రాచీన చైనా సైనిక వ్యూహకర్త లావోజు ''యుద్ధం చేయకుండానే శత్రువును ఓడించటమే నిజమైన యుద్ధలక్షణం'' అన్నాడు. భారత్ కార్గిల్ విషయంలో అదే సిద్ధాంతాన్ని పాటించి పాకిస్తాన్‌ను చావుదెబ్బ కొట్టింది.

పాకిస్తాన్ చొరబాటు చర్యల్ని ప్రారంభించేటప్పుడు కొన్ని అంచనాలు వేసుకుంది. ఒకటి భారతదేశంలోని కేంద్ర ప్రభుత్వం బలహీనమైనది కాబట్టి అది సాహసోపేతమైన నిర్ణయాలు తీసుకోలేకపోవచ్చునన్నది పాకిస్తాన్ అంచనా. ప్రతిపక్షాలు - ప్రభుత్వం వాదవివాదాల్లో కూరుకుపోయి ఉంటాయని, తద్వారా తమపనిని సానుకూలంగా ముగించుకోవచ్చునని పాకిస్తాన్ భావించింది. రెండవది - పాకిస్తాన్ అంతర్జాతీయంగా అమెరికా, ఇస్లామిక్ దేశాలు, చైనాల నుంచి మద్దతును కూడగట్టుకోగలనని ఆశించింది. భారత్‌ని అంతర్జాతీయంగా ఒంటరిగా చేసి, తన లక్ష్యాల్ని సాధించవచ్చునని ఊహించింది.

కానీ మన ప్రభుత్వం, ప్రజలు ప్రతిస్పందించిన తీరు పాకిస్తాన్‌ను కంగు తినిపించింది. అత్యంత కఠినమైన పరిస్థితుల్లో మనసైన్యం సాగించిన పోరాటంతో పాకిస్తాన్ దిమ్మతిరిగి పోయింది. కేంద్ర ప్రభుత్వం తొలిసారి క్రియాశీలక విదేశీదౌత్యాన్ని నడిపించి, అత్యంత చాకచక్యంగా అంతర్జాతీయ రాజకీయాలలో పావుల్ని కదిపింది. మన విదేశాంగమంత్రి, దౌత్య నిపుణులు ప్రముఖ దేశాలన్నిటా సుడిగాలి పర్యటనలు చేసి కార్గిల్ ఘటనలకు సంబంధించిన నిజాలను ముందుంచారు. భారత్ ఇంత చొరవతో వ్యవహరిస్తుందని పాకిస్తాన్ అసలు ఊహించలేదు. ఎప్పటిలాగా

భారత్ ఎదురుదాడి కేవలం ప్రకటనలకు మాత్రమే పరిమితమై ఉండి పోతుందన్న అంచనా తల్లకిందులైంది. భారత దౌత్య నిపుణులు ఎక్కడికక్కడ ఆటకట్టించటంతో ప్రపంచం ముందు పాకిస్తాన్ దురాక్రమణ చేసిన దోషిగా బోనెక్కింది. చైనా, అమెరికా, జర్మనీ, జపాన్‌లతో సహా అన్ని ప్రముఖ దేశాలూ పాకిస్తాన్‌ను తప్పుపట్టాయి.

## మారిన అంతర్జాతీయ సమీకరణాలు

నిజానికి పాకిస్తాన్ వాజ్‌పేయి ప్రభుత్వపు కృతసంకల్పాన్ని, భారతీయ జనత దృఢనిశ్చయాన్ని తక్కువగా అంచనావేసింది. అయితే దీనితోపాటు అంతర్జాతీయంగా వస్తున్న మార్పులను అధ్యయనం చేయడంలోనూ పాకిస్తాన్ తప్పటడుగు వేసింది. ప్రచ్ఛన్న యుద్ధం కొనసాగేంతవరకూ అమెరికా రక్షణ వ్యూహంలో పాకిస్తాన్‌ది అత్యంత కీలకమైన పాత్ర!

అటు కమ్యూనిస్టు రష్యాను, ఇటు దక్షిణాన భారతదేశాన్ని అదుపులో పెట్టేందుకు అమెరికాకు అప్పట్లో పాకిస్తాన్ అవసరం ఉండేది. అమెరికా దృష్టిలో పాకిస్తాన్ దక్షిణాసియాలలో ప్రవేశించేందుకు సింహద్వారమైతే, రష్యా, మధ్య ఆసియా, గల్ఫ్‌లో అడుగుమోపేందుకు దొడ్డిదారి. ఇస్లామిక్ దేశాల్లో ప్రాపకం పెంచుకునేందుకు, సోవియట్ యూనియన్‌లోని ముస్లిం జనాభాను ప్రభావితం చేసేందుకు, రష్యా నియంత్రణలో ఉండే అఫ్ఘనిస్తాన్‌ను అదుపు చేసేందుకు అమెరికా పాకిస్తాన్‌ను ఉపయోగించుకుంది. ఈ దృష్ట్యా అమెరికా మొదటి నుంచీ పాకిస్తాన్‌కు ఆయుధాలు, ఆర్థిక దన్ను సమకూరుస్తూ వచ్చింది. పాకిస్తాన్ ఆర్థిక రంగు పూర్తిగా అమెరికా సహకారంపైనే ఆధారపడి ఉంది. అంతర్జాతీయంగా పాకిస్తాన్‌కి అమెరికా ఒక గొడుగుగా మారింది. పాకిస్తాన్ కూడా అమెరికా రక్షణ వ్యూహమైన 'సెంటో'లో సభ్యత్వం పొందింది. అమెరికా సెంట్రల్ కమాండ్

(సెంట్‌కామ్) వ్యూహంలో పాకిస్తాన్ అంతర్భాగం.

అఫ్ఘనిస్తాన్‌పై రష్యా దురాక్రమణ తరువాత ముందు ముజాహిదీన్‌లను, తరువాత తాలిబాన్లను తయారుచేసి, అఫ్ఘన్ పాలకులకు వ్యతిరేకంగా పోరాడేలా చేసేందుకు అమెరికా పాకిస్తాన్‌కి అన్ని రకాలుగా సాయం చేసింది. అత్యాధునిక ఆయుధాలను సరఫరా చేసింది. అప్పట్లో దక్షిణాసియా వ్యూహరచనలో పాకిస్తాన్ ప్రాధాన్యం అకస్మాత్తుగా పెరిగిపోయింది.

అదే సమయంలో పాకిస్తాన్ అమెరికాను బ్లాక్‌మెయిల్ చెసి తన అస్త్ర పాటవాన్ని పెంపొందించుకొంది. భారత్‌కు వ్యతిరేకంగా పలు పన్నాగాలు పన్నింది. వీటి ఫలితంగానే పంజాబ్‌లో, కాశ్మీరులో తీవ్రవాదం పెట్రేగింది. భారత్‌లో అడుగడుగునా ఐఎస్ఐ జాలం విస్తరించింది. అమెరికా కూడా దీనిని చూసీ చూడనట్టు వ్యవహరించింది. అంతేకాదు! తన వంతు సాయం కూడా అందించింది. కాశ్మీరును అటు భారత్‌కి, ఇటు పాకిస్తాన్‌కీ చెంద కుండా, ఒక స్వతంత్ర ప్రతిపత్తిగల ప్రాంతంగా చేయాలని ప్రతిపాదించింది.

అయితే ఇప్పుడు పరిస్థితి మారింది. సోవియట్ సామ్రాజ్యం అంతరించి పోయింది. రష్యా ఇప్పుడు సూపర్ పవర్‌కాదు. దీనితో అమెరికాకు రష్యా నుంచి ప్రమాదం తొలగిపోయింది. ఇదే సమయంలో దక్షిణాసియా ప్రాంతంలో పెరుగుతున్న చైనా ప్రాబల్యానికి అడ్డుకట్ట వేయడంలో భారత్ కీలక పాత్ర వహించగలదన్న అభిప్రాయం అమెరికన్ వ్యూహకర్తల్లో బలపడింది. దీనితో దక్షిణాసియా వ్యూహాల్లో భారత్ ప్రాముఖ్యం పెరిగింది. అమెరికాకు కూడా భారత్ అవసరం కనిపించడం మొదలైంది. అటు చైనా, రష్యాలు కూడా అమెరికన్ ఆధిపత్యాన్ని సవాలు చేయాలంటే భారత్‌తోడ్పాటు కావాలన్న అభిప్రాయానికి వచ్చాయి. రష్యా

ఇటీవలి కాలంలో భారత - రష్యా - చైనాల కూటమి ఏర్పడాలని పదే పదే ప్రతిపాదిస్తూండటం వెనుక ఇదే ఆలోచన ఉందన్నది గమనార్హం.

అటు చైనాకి, ఇటు అమెరికాకి పాకిస్తాన్ అవసరం తీరిపోయింది. దానికితోడు పాకిస్తాన్ ఇస్లామిక్ తీవ్రవాదాన్ని పెంచి పోషిస్తున్న పద్ధతి రెండు దేశాలకూ మింగుడు పడటంలేదు. చైనాలోని జింజియాంగ్ ( సింకియాంగ్) ప్రాంతంలో ముస్లిం మైనారిటీలు పెద్ద సంఖ్యలో ఉన్నారు. వీరిలో తిరుగుబాటు ధోరణులకు పాకిస్తాను నుంచి ప్రోత్సాహం లభిస్తోంది. ఇటీవలే ఒక పాకిస్తానీ తీవ్రవాదిని చైనా ఉరితీసింది కూడా! తాలిబాన్లు అఫ్ఘనిస్థాన్‌లో సృష్టిస్తున్న బీభత్సం, అంతర్జాతీయ ఇస్లామిక్ తీవ్రవాది ఒసామా బిన్‌లాదెన్‌కు పాకిస్తాన్‌లో ఆశ్రయం కల్పించటం వంటివి అమెరికాకు కూడా ఇబ్బందికరంగా పరిణమిస్తున్నాయి. అందుకే ఈ రెండు దేశాల్లోనూ పాకిస్తాన్ విషయంలో పునరాలోచన ప్రారంభమైంది.

పాకిస్తాన్ ఈ మార్పుల్ని అర్థం చేసుకోవడంలో విఫలమైంది. అదే సమయంలో కేంద్రంలోని జాతీయవాద బిజెపి ప్రభుత్వం వీటిని అవగతం చేసుకోవడమేకాక, వీటిలో అవకాశాలను వెతకగలిగింది. సరైన అంచనాలతో బిజెపి ప్రభుత్వం ముందుకు నడవగలిగింది. అటు రష్యాకు, ఇటు అమెరికాకు, మరోవైపు చైనాకు భారత్‌తో సత్సంబంధాలు నెలకొల్పుకోవలసిన అవసరం ఏర్పడింది. కాబట్టి ఈ మారిన పరిస్థితులను అనుకూలంగా మలచుకోవలసిన అవసరాన్ని బిజెపి ప్రభుత్వం గుర్తించగలిగింది.

## సమర్థవంతమైన విదేశాంగ విధానం

నిజానికి ఈ అవకాశాలు ఇరాన్ - కువైట్ యుద్ధకాలం నుంచే మనకు లభించాయి. కానీ ప్రభుత్వాలు వీటిని అనుకూలంగా మలుచుకోవడంలో

విఫలమయ్యాయి. వాజ్‌పేయి ప్రభుత్వం ఈ విషయంలో ఒక స్పష్టమైన వ్యూహంతో, పకడ్బందీ ఎత్తుగడతో ముందుకు సాగింది. పోఖరణ్ విస్ఫోటనాలు, క్షిపణి ప్రయోగాలు భారత్‌ను బలీయమైన సైనిక శక్తిగా చేసే ప్రయత్నంలో భాగాలే! ఆర్థిక ఆంక్షల్ని సమర్థవంతంగా ఎదుర్కొని దేశపు అంతరిక శక్తిని నిరూపించడం కూడా మనకు ఎంతో ఉపయోగపడింది. ఈ ప్రయత్నాలన్నిటి ఫలితంగా బిజెపి ప్రభుత్వం భారత్‌ను విశ్వరాజకీయాల్లో ఒక అత్యంత ప్రముఖ శక్తిగా చేశాయి. నిజానికి గత ఏడాది పాటూ బిజెపి అనుసరించిన విదేశాంగనీతి ఆత్మవిశ్వాసం ఆధారంగా సాగింది.

కార్గిల్ చొరబాటు ప్రభుత్వం అనుసరిస్తున్న విదేశాంగ నీతిని పరీక్షకు పెట్టింది. ఆ పరీక్షలో బిజెపి ప్రభుత్వం ఘనవిజయం సాధించిందన్నది తాజా పరిణామాల వల్ల వెల్లడవుతోంది. కార్గిల్‌లో పాకిస్తానీ సైనికుల చొరబాటును తిప్పికొట్టే విషయంలో ఒకవైపు సైనిక చర్యలను చేపట్టడం, రెండోవైపు దేశప్రజలను చైతన్యపరచడం, మూడోవైపు అంతర్జాతీయంగా పాకిస్తాన్‌ను ఏకాకిని చేయడం - అన్న త్రిముఖవ్యూహాన్ని బిజెపి ప్రభుత్వం అనుసరించింది. ఈ వ్యూహాన్ని చాలా పకడ్బందీగా అమలు పరచగలగడంలో ప్రభుత్వం విజయం సాధించింది.

నిజానికి కార్గిల్‌లో సంఘర్షణని పూర్తిస్థాయి యుద్ధంగా మారనీయకుండా భారత్ అత్యంత సంయమనం పాటించడం, అదే సమయంలో అసమాన ధైర్యసాహసాలు, అపూర్వ త్యాగాలు, బలిదానాలతో సైన్యం శత్రువును తిప్పికొట్టడం యావత్ ప్రపంచాన్ని నివ్వెరపరిచాయి. కార్గిల్‌లోని భౌగోళిక పరిస్థితులు భారత్‌కి చాలా ప్రతికూలంగా ఉన్నాయి. అయినా మన జవాన్లు విజయాలు సాధిస్తున్నారు. ఈ కొండ చరియల్లో, ఈ భీకరమైన

మంచులో భారతీయ జవాన్లు పోరాటం చేస్తున్న తీరును ప్రపంచ వ్యాప్తంగా సైనిక వ్యూహకర్తలు, మిలటరీ నిపుణులు పరిశీలిస్తున్నారు. రాబోయే రోజుల్లో వీటిపై నిశితమైన అధ్యయనాలు, చర్చలు జరుగుతాయనడంలో సందేహం లేదు.

ఇక దౌత్యపరంగా భారత్ సాధించిన విజయాలు కూడా అపూర్వమైనవి. మారిన పరిస్థితులను పూర్తిగా ఉపయోగించుకుని అమెరికా, చైనా, జి - 8 దేశాల కూటమిని తనవైపు తిప్పుకోవటంలో భారత్ ఘనవిజయాన్ని సాధించింది. దీనివల్ల పాకిస్తాన్ ప్రపంచంలో ఒంటరిదైపోయింది. ఇక అంతర్జాతీయ రాజకీయాల్లో తన అసలుస్థాన మేమిటన్న విషయం పాకిస్తాన్‌కి కార్గిల్ చొరబాటువల్ల స్పష్టంగా బోధపడింది. పాకిస్తాన్‌పై చొరబాటుదారు అన్న ముద్రపడింది. మరోవైపు యుద్ధంలో ఏ వైపు నుంచీ సాయం వచ్చే ఆశలు కనిపించలేదు. దీనితో పాకిస్తాన్ పరమాణు బాంబుల్ని ప్రయోగిస్తానని ''న్యూక్లియర్ బ్లాక్‌మెయిల్'' కి పాల్పడింది. ఇది పాకిస్తాన్‌ను ఒక 'బాధ్యతారహిత దేశంగా' ప్రపంచదేశాల ముందు నిలబెట్టింది. ఒకవైపు కుప్పకూలుతున్న ఆర్థికవ్యవస్థ, ఆర్థిక ఆంక్షల అదనపు భారం పాకిస్తాన్‌ను చాలా దెబ్బతీశాయి. వీటన్నిటి ఫలితంగానే నవాజ్‌షరీఫ్ అమెరికాయాత్ర చేయడం, తమ సైనికుల్ని వెనక్కి పిలుచుకుంటానని అంగీకరించడం జరిగాయి.

## పాకిస్తాన్‌ని నమ్మవచ్చా?

ప్రస్తుతానికి పాకిస్తాన్ తలవంచినా, పాకిస్తాన్ తత్వం తెలిసిన వారెవరూ అది ఎక్కువకాలం శాంతిని, సౌహార్దాన్ని పాటిస్తుందంటే నమ్మలేరు. పాకిస్తాన్ ఈ పరాభవానికి ప్రతీకారంగా దేశంలో ఐఎస్ఐ కార్యకలాపాల్ని

ముష్కరం చేయవచ్చు. అదేవిధంగా ఇతర ప్రదేశాల్లో దాడులు, కాల్పులు ప్రారంభించవచ్చు. అది పాకిస్తాన్ సహజమైన స్వభావం.

1965 భారత - పాక్ యుద్ధానంతరం రాష్ట్రీయ స్వయంసేవక సంఘ్ ద్వితీయ సరసంఘచాలకులైన శ్రీ గురూజీ గోల్వాల్కర్ పాకిస్తాన్ గురించి చేసిన హెచ్చరికలు ఈ సందర్భంగా గుర్తుంచుకోదగ్గవి!

''మరొక పాకిస్తానీ దండయాత్ర ప్రమాదం ఇంకా ఉండనే ఉంది. కాల్పుల విరమణ ముసుగులో నేడది సైన్యాన్ని పెంచుకోవడానికి తీవ్రంగా కృషి చేస్తోంది. తామెంత నష్టపడినప్పటికీ, మన ఆయుధ సామగ్రి, సైనిక వ్యూహరచన, మన శక్తి, మన బలహీనతల్ని అది కనిపెట్టింది. ఈ అనుభవం నుంచి గుణపాఠాన్ని గ్రహించి, తన లోటుపాట్లను సరిదిద్దుకుని మళ్ళీ అది దాడి చేసి తీరుతుంది. యుద్ధోన్మాద జాతులు యుద్ధానంతర శాంతిని మరింత పెద్దయుద్ధానికి సంసిద్ధమయ్యేందుకే సర్వదా వినియోగించు కున్నాయి. నిజానికి తనకు కలిగిన ఆయుధ నష్టాన్ని పాకిస్తాన్ ఈపాటికే వేగంగా భర్తీ చేసుకుంటూ ఉంటుంది. అది ఇంకా కయ్యానికి కాలు దువ్వుతూనే ఉంది. యుద్ధవిరమణ రేఖను దురహంకారంతో పదేపదే అతిక్రమిస్తోంది........... ఈ పరిస్థితి మనకు అత్యంత అవమానకరం. ఇది సహించరానిది. ఈ పరిస్థితిని ఎక్కువకాలం కొనసాగనివ్వరాదు. దీనికి ఒక అంతం వుండాలి. తాడో పేడో తేల్చేయాలి.

పాకిస్తాన్ ఈసారి చర్చలకు ఆహ్వానిస్తున్నప్పటికీ మన ప్రభుత్వం దానిని దృఢంగా తిరస్కరించడం, ఐఎస్ఐ కార్యకలాపాలు, లాహోర్ ఒప్పందం వంటి అంశాలపై తన వైఖరి విశ్వాసయోగ్యంగా ఉండేంత వరకూ చర్చలకు రాబోమని చెప్పడం సరైన చర్యలే!

అయితే పాకిస్తాన్ మన దేశంలో ప్రోత్సహిస్తున్న ఇస్లామిక్ తీవ్రవాదాన్ని నిర్దాక్షిణ్యంగా అణచివేయాల్సిన అవసరం ఉంది. ప్రభుత్వం ఇందుకు నిర్ణయాత్మకమైన చర్యల్ని చేపట్టాలి. పాకిస్తాన్ మనదేశంలో విధ్వంసాత్మక కార్యకలాపాలను నిర్వహిస్తున్నట్టే మనమూ పాకిస్తాన్‌లో విచ్ఛిన్నవాదాన్ని పెంచి ప్రోత్సహించాలి. కుక్క కాటుకు చెప్పు దెబ్బ లాంటిది.

భద్రతా వ్యవహారాల నిపుణుడు బ్రహ్మచెల్లానీ పాకిస్తాన్‌ను ఆర్థికంగా దిగ్బంధం చేయాలని సూచించారు. పాకిస్తాన్‌కు అత్యంత ప్రాధాన్యతాదేశం అర్హతను ఇచ్చిన ఏకైక డబ్ల్యుటివో సభ్యదేశం కేవలం మనదేశమే. దీనిని ఉపసంహరించుకోవాలి. పాకిస్తాన్‌లోని విదేశీ పెట్టుబడుల్లో 50శాతం విద్యుత్‌రంగంలో ఉన్నాయి. విద్యుత్‌రంగం పాకిస్తాన్‌లోని నదులపై ఆధారపడి ఉంది. ఆ విద్యుత్ కొనుగోలు చేసేదీ భారతదేశమే! కాబట్టి ఈ విషయంలోనూ తగిన చర్యలు చేపట్టాలి. గమనించాల్సిన విషయ మేమిటంటే పాకిస్తానీ జలవనరులు, విద్యుత్ అభివృద్ధి బోర్డుపై సైన్యపు ప్రత్యక్ష నియంత్రణ ఉంది.

మరో భద్రతా వ్యవహారాల నిపుణుడు కె. సుబ్రమణ్యం భారతదేశపు రక్షణ వ్యయాన్ని స్థూల జాతీయోత్పత్తిలో 3శాతానికి పెంచితే చాలు, పాకిస్తాన్‌ని దెబ్బ తీయవచ్చునని అంటారు. మనం రక్షణ వ్యయాన్ని పెంచితే పాకిస్తాన్ కూడా తన రక్షణ వ్యయం పెంచుతుంది. ఈ పోటీలో పాకిస్తాన్ ఆర్థిక శక్తి పూర్తిగా అంతరించిపోవడం ఖాయమని ఆయన అభిప్రాయపడుతున్నారు.

ఇవన్నీ ఒక ఎత్తు - కార్గిల్ వల్ల ఈ దేశంలో ఏర్పడ్డ అపూర్వ జనజాగృతి చిరస్థాయిగా ఉండేలా చేసేందుకు తగిన చర్యలు చేపట్టాల్సిన అవసరం వుంది. దేశభక్తి పాలపొంగులా పెరిగి, తగ్గితే దేశానికి ఎలాంటి లాభమూ వుండదు.

శ్రీ గురూజీ చెప్పినట్టు ''జాతీయ చైతన్య సమైక్యాలు శత్రు దురాక్రమణ జరిగిన సమయంలో తాత్కాలికంగా పెల్లుబికి వచ్చే భావనలు గాకాక, మరింత లోతుగా, భావాత్మకంగా నాటుకోవాలి. అలాంటి శ్రద్ధ, ఏకాత్మతల వేళ్ళు ఎక్కడ ఉన్నాయన్నది అన్వేషించాలి. అలా చేసి నప్పుడే మనం కార్గిల్ నుంచి నిజంగా గుణపాఠం నేర్చుకున్నట్టవుతుంది.

శ్రీ గురూజీ మాటల్లోనే చెప్పాలంటే -

''విశుద్ధ జాతీయ భావనలోనే వాస్తవమూ, శాశ్వతమూ అయిన స్ఫూర్తి లభిస్తుంది. మనందరికీ తల్లి అయిన పవిత్ర భారతమాతపట్ల ఉజ్వల ప్రేమభావన, ఒకేతల్లి సంతానంగా అనన్యమూ, అవిభాజ్యమూ అయిన మాతృభావన, మన ప్రాచీన వైభవంపట్ల, మన విశిష్ట సాంస్కృతిక వారసత్వం పట్ల గర్వం. భారతమాతను ప్రపంచ జాతుల మధ్య ఆమె పురాతన వైభవ ప్రతిష్ఠల శిఖరాగ్రాన మళ్ళీ చూడగలగాలన్న ఆకాంక్ష - ఇవి మాత్రమే శక్తిమంతమూ, శాశ్వతమూ అయిన ప్రేరణను ఇస్తాయి. ఆ పొంగు దేశంలోని మహోన్నతులను, అతి సామాన్యులను కూడా ముంచి లేవనెత్తి, దేశం కొరకు వారిలోని అత్యున్నత గుణసంపదను వెలువరిస్తుంది. ప్రస్తుత క్లిష్ట సమయంలో ప్రదర్శితమైన ప్రజల అజేయ ఆంతరికశక్తిని అది మాత్రమే పూర్తిగా వికసింప చేస్తుంది. ఆనాడే బ్రహ్మతేజ, క్షాత్రతేజాలు మూర్తీభవించి, అజేయమూ, అఖండమూ అయిన భారతమాత ఒక చేత కమలాన్ని, మరొక చేత వజ్రాన్ని ధరించి, వరప్రదాయినిగానూ, దుష్టసంహారిణిగానూ ప్రత్యక్షమౌతుంది!''

ఆ దిశలో జాతీయవాదులు ప్రయత్నించటమే నేటి తక్షణ అవసరం.




శ్రీనగర్ - లేహ్ రహదారిపై సైనిక వాహనాలు



సరిహద్దుల్లో ప్రధాని, రక్షణమంత్రి